# తెలుగు సామెతలు



రెంటాల గోపాలకృష్ణ

పబ్లిషర్స్ :
నవరత్న బుక్ సెంటర్
కారల్‌మార్క్స రోడ్, విజయవాడ-2.

తెలుగు సామెతలు

రచన :
రెంటాల గోపాలకృష్ణ

ప్రథమ ముద్రణ :
అక్టోబర్ : 1997

ప్రచురణ హక్కులు :
బి.కె.ఆర్. మూర్తి
ఇ, నెం. 28-22-20,
రహమాన్ వీధి, విజయవాడ-2.
ఫోన్ : 432813

ముఖ చిత్రం :
ఎ. రవిబాబు

టైప్ సెట్టింగ్ :
అలకనంద
విజయవాడ-3.

ప్రింటర్స్ :
శ్రీ విజయలక్ష్మి ఆఫ్‌సెట్ ప్రెస్
టిక్కిల్‌రోడ్, విజయవాడ-2.
ఫోన్ : 428977

**వెల : 30-00**

# తెలుగు సామెతలు

## "అ" "అ"

1. అత్తా ఒకింటి కోడలే.
2. అడవి కాచిన వెన్నెల.
3. అడకత్తెరలో పోకచెక్కలాగా.
4. అడిగితేకాని అమ్మయినా పెట్టదన్నట్లు.
5. అడిగేవాడికి చెప్పేవాడు లోకువ.
6. అడుగులోనే హంసపాదు.
7. అతి రహస్యం బట్టబయలు.
8. అటైతే కందిపప్పు, ఇటైతే పెసరపప్పు
9. అచ్చిపెళ్ళి బుచ్చిచావుకు వచ్చిందట.
10. అంత్య నిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరం మేలు.
11. అంధుడికి అద్దం చూపినట్లు.
12. అందరికీ శకునం చెప్పే బల్లి కుడితి తొట్లో పడిందట.
13. అంగట్లో అన్నీ ఉన్నాయి, అల్లుడినోట్లో శని ఉంది.
14. అత్త చచ్చిన ఆరు మాసాలకు కోడలు ఏడ్చిందట!
15. అత్తలో మంచీలేదు, వేములో తీపీ లేదు.
16. అత్తలేనీ కోడలుత్తమురాలు, కోడలులేనీ అత్త గుణవంతురాలు.
17. అంగిట బెల్లం కడుపులో విషం.
18. అంటాముట్టరాని అగ్రహారం.
19. అండలేనీ ఊళ్ళో ఉండదోషం, ఆశలేనీ పుట్టింట అడగ దోషం.

20. అందని మాని పండ్లకు అర్రులు చాచినట్లు.

21. అందరూ అందలమెక్కితే మోసేవాళ్ళెవరు?

22. అందరూ ఒక ఎత్తైతే అగస్త్యుడు ఒక్కడూ ఒక ఎత్తు, అతని కమండలం ఒక ఎత్తు.

23. అంతా శ్రీ వైష్ణవులే కాని బుట్టెడు రొయ్యలూ ఏమైనాయో!

24. అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు.

25. అంబలి త్రాగేవారు కొందరైతే మీసాలు ఎగబట్టేవారు కొందరట.

26. అక్క మనదైతే మాత్రం బావ మనవాడా?

27. అగ్నికి వాయువు తోడైనట్లు.

28. అద్దంలో ముదుపు, అరచేతి స్వర్గం.

29. అనువుగానిచోట అధికులమనరాదు.

30. అప్పిచ్చినాడు బాగు కోరతాడు తీసుకున్నవాడు చెడుకోరతాడు.

31. అభ్యాసం కూసువిద్య

32. అమ్మ గృహప్రవేశం, అయ్య అగ్ని ప్రవేశం.

33. అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి.

34. అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు.

35. అల్లుడికి వండిన అన్నం కొడుక్కు పెట్టిందట.

36. అల్పుడికి ఐశ్వర్యం వస్తే అర్ధరాత్రి వేళ గొడుగు పట్టమన్నాట్ట.

37. అర్తి దుఃఖం ఆరునెల్లు. కడుపు దుఃఖం కలకాలం.

38. అవ్వ వడికిన నూలు తాత మొలత్రాడుకే సరిపోయిందట.

39. ఆకలి రుచి ఎరుగదు, నిద్ర సుఖమెరుగదు, వలపు సిగ్గెరగదు.

40. ఆకాశానికి నిచ్చెన వేసినట్లు.

41. ఆడదాని చేతి అద్దం మగవాడి చేతి బిడ్డ బ్రతకదట.

42. ఆడదాని మాట నీటిలో మూటా ఒకటేనట.

43. ఆడలేక మద్దెల మీద పడ్డట్టు.

44. ఆడితప్పారాదు. పలికి బొంకారాదు.

45. ఆర్చేవారేకాని తీర్చేవారు లేరు.

46. ఆలూలేదూ చూలూలేదు,కొడుకుపేరు సోమలింగమట.

47. ఆహారం దగ్గర వ్యవహారం దగ్గర మొగమాటం పనికిరాదు.

48. అందరికీ నేను లోకువ. నాకు నంబి సింగరాయ లోకువ.

49. అగ్ని శేషం, వ్రణ శేషం, ఋణశేషం, రణ శేషం ఉండ రాదు.

50. అగ్నిలో ఆజ్యం పోసినట్లు.

51. అచ్చొచ్చిన భూమి అడుగడే చాలు.

52. అట్లుపోసే ఆమెకు ఆరుగురు అందివ్వాలట.

53. అడవిలో ఉసిరికాయకి, సముద్రంలో ఉప్పుకూ సంబంధం.

54. అడుసు త్రొక్కనేల కాలు కడుగనేల.

55. ఆయనగారుంటే మంగలాడితో పనేమిటి.

56. అత్తకొట్టిన కుండ అడుగోటి కుండ కోడలు కొట్టిన కుండ కొత్తకుండ.

57. అత్తచేసే పన్లకు ఆరళ్ళే లేవట.

58. అత్తవల్ల దొంగతనం, మొగుడివల్ల రంకుతనం నేర్చుకున్నట్లు.

59. అత్తసొమ్ము అల్లుడు దానం చేసినట్లు.

60. అది కుమ్ము, ఇది దుమ్ము, వదరా పందిట్లోకి అన్నాట్ట.

61. అధముడికి ఆలి అయ్యేదానికంటే బలవంతుడికి బానిస కావటం మేలట.
62. అన్నం పెడితే అరిగిపోతుంది, చీరపెడితే చినిగిపోతుంది, వాత పెడితే కలకాలం ఉంటుంది.
63. అన్నం పెట్టిన వాడింటికి కన్నం వేసినట్లు.
64. అన్న చొరవేకాని అక్షర చొరవలేదు.
65. అన్నాలన్నీ సున్నాలు, అప్పాలన్నీ కప్పాలు.
66. అన్నీ తెలిసినవాడూ లేడు. ఏమీ తెలియని వాడూ లేడు.
67. అన్నీ ఉన్న ఆకు అణిగి పడిఉంటుంది ఏమీలేని ఆకు ఎగిరెగిరి పడుతుంది.
68. అన్నీ ఉన్నాయిగాని ఒక్క అయిదో తనమే లేదట.
69. అప్పుచేసి పప్పు కూడు తిన్నట్లు.
70. అప్పున్నవాడితోటీ, చెప్పులున్న వాడితోటీ వెళ్ళకూడదంటారు.
71. అబద్ధం ఆడినా గోడపెట్టినట్లుండాలి.
72. అబ్బురానికి బిడ్డ పుడితే గడ్డపార తేరా చెవులు కుడతానన్నాడట.
73. అమావాస్యకు అట్లు, పున్నానికి బూరెలు.
74. అమ్మ పెట్టాపెట్టదు. అడుక్కుతినా నివ్వదు.
75. అమ్మబోతే అడివి కొనబోతే కొరివి.
76. అయితే ఆడబిడ్డ కాకుంటే మొగబిడ్డ అన్నాట్ట.
77. అయితే ఆదివారం కాకపోతే సోమవారం అన్నట్లు.
78. అయ్యగార్ని చెయ్యబోతే కోతి అయినట్లు.
79. అరిచే కుక్క కరవదు.

80. అరచేతికి పండ్లొచ్చినట్లు.

81. అరవై ఏళ్ళొస్తే చదువుకోక చస్తాడా!

82. అరిటాకొచ్చి ముల్లుమీద పడ్డా ముల్లొచ్చి అరిటాకు మీద పడ్డా అరిటాకుకే నష్టం.

83. అర్ధరాత్రివేళ అంకమ్మ శివాలన్నట్లు.

84. అలవాటులేని అవపోసన చెయ్యబోతే మూతి మీసాలన్నీ తెగ కాలినయట.

85. అలివిగాని ఆలినిచేసుకొని మురిగిచచ్చెరా ముండాకొడుకు.

86. అయినవారికి ఆకుల్లో కానివారికి కంచాల్లో పెట్టినట్లు.

87. అవ్వని పట్టుకొని వసంతమాడినట్లు.

88. అడ్డాలనాడు బిడ్డలు కాని గడ్డాలనాడు బిడ్డలా?

89. అరణ్యరోదనం.

90. అవలక్షణాలున్నవాడికి అక్షింతలు ఇస్తే అవతలకు పోయి నోట్లో వేసుకున్నాట్ట.

91. అయ్యవార్ల నట్టిల్లులాగా.

92. 'అ' అంటేఅపశబ్దం. 'నారాయణ'అంటే బూతుమాట.

93. ఆకలి వేస్తుంది అత్తగారూ అంటే రోకలి మింగవే కోడలా అన్నదట.

94. ఆకలి ఆకాశమంత. గొంతు సూది బెజ్జమంత.

95. ఆకుకు అందకుండా పోకకు పొందకుండా.

96. ఆచారానికి అంతంలేదు. అనాచారానికి ఆదిలేదు.

97. ఆడది బొంకితే గోడపెట్టినట్లు మొగవాడు బొంకితే తడిక కట్టినట్లు.

98. ఆడపెత్తనం తంబళ్ళ దొరతనం.

99. ఆడబోయిన తీర్థం ఎదురొచ్చినట్లు.

100. ఆడింది ఆట పాడింది పాట.

101. ఆడేకాలు పాడేనోరు.

102. ఆమడలు దూరమైతే అంతఃకరణలు దూరమా.

103. ఆరంభ శూరత్వం.

104. ఆరునెల్లు స్నేహం చేస్తే వారు వీరవుతారట.

105. ఆలికి అన్నం పెట్టడం ఊరికి ఉపకారమా.

106. ఆరునెల్లు సాముచేసి మూలనున్న ముసలిదాన్ని కొట్టినట్లు.

107. ఆవలింతకు అన్నలున్నారుకాని తుమ్ముకు తమ్ముళ్ళు లేరట.

108. ఆవు చేలో మేస్తే దూడ గట్టున మేస్తుందా?

109. ఆవుపాడి ఎన్నాళ్ళు, ఐశ్వర్యం ఎన్నాళ్ళు. బఱ్ఱెపాడి ఎన్నాళ్ళు, భాగ్యమెన్నాళ్ళు

110. ఆవులను మళ్ళించినవాడే అర్జునుడు.

111. ఆశ దోషమెరుగదు వూటకూళ్ళమ్మ పుణ్యమెరుగదు.

112. ఆపోది మాటలకు అర్థంలేదు గుడ్డికంటికి చూపూలేదు.

113. అవివేకితో స్నేహంకన్నా వివేకితో విరోధం మేలు.

114. ఆవులూ ఆవులూ పోట్లాడితే లేగదూడల కాళ్ళు విరిగినట్లు.

115. అంతెలేని కోతి లంకంతా చెరిచిందట.

116. అంగట్లో అరువు తలమీద బరువు.

117. అంగడాన్ని బట్టి గొడ్డు, వంగడాన్నిబట్టి బిడ్డ.

118. అంగడి అమ్మి గొంగళి కొన్నట్లు.

119. అంచుడాబేకాని పంచెడాబులేదట.

120. అంటనప్పుడు ఆముదం రాచుకున్నా అంటదు.

121. అండలుంటే కొండలు దాటొచ్చు.

122. అంతకు తగిన గంత, గంతకు తగిన బొంత.

123. అందచందాలు లేని మొగుడు మంచంనిండా ఉన్నాట్ట.

124. అందని ద్రాక్షపళ్ళు పుల్లన అన్నట్లు.

125. అందరి కాళ్ళకు మొక్కినా అత్తగారింటికిపోక తప్పదు.

126. అందరికీ అట్ల పండగ, మనకు ముట్ల పండగ.

127. అందరికీ అన్ని రోగాలున్నాయిగాని అడ్డెడు తప్పాలకు ఏ రోగం లేదట.

128. అకటా వికటపురాజు, అవివేకపు ప్రధాని, చాదస్తపు పరివారం.

129. అక్కన్న అద్దంకి పోనూపొయ్యాడు రానూ వచ్చాడు.

130. అక్కరున్నంతవరకూ, ఆదినారాయణ అక్కర తీరింతర్వాత బాది నారాయణ

131. అక్కరకు ఒడవని అర్థమెందుకు, అక్కరకు రాని చుట్టమెందుకు.

132. అక్కర తీరిన తర్వాత అల్లుడు తొత్తుకొడుకైనట్లు.

133. అగసాలిని, వెలయాలిని నమ్మకూడదు.

134. అచ్చమ్మ పెళ్ళిలో బుచ్చెమ్మ శోభనం.

135. అచ్చుబోసిన ఆంబోతు.

136. అడ్డెడు తవ్వెడు బియ్యమిచ్చి అమ్మా నీ ప్రసాదం అన్నట్లు.

137. అతడికంటె ఘనుడు ఆచంట మల్లన్న.

138. అతివృష్టి అనావృష్టి ఏదయినా ఆకలిబాధ తప్పదు.

139. అతుకుల కాపరం చితుకుల మంటలాంటిది.

140. అతుకుల బొంత గతుకుల బాట.

141. అత్తకు అల్లుడాశ బాపడికి పప్పాశ.

142.అత్తను కొట్టి అటకెక్కిందట. మొగుణ్ణి కొట్టి మొగసాల కెక్కిందట.

143.అత్త పెట్టే ఆరళ్ళే కనపడతాయి కాని కోడళ్ళు చేసే కొంటె పన్లు కనపడవట.

144.అదిగో పులి అంటే ఇదిగో తోక అన్నట్లు.

145.అదృష్టం చెప్పిరాదు, దురదృష్టం చెప్పిపోదు.

146.అదృష్టవంతుణ్ణి చెడగొట్టేవాడు లేడు భ్రష్టుణ్ణి బాగుపరచే వాడులేడు.

147.అనగా అనగా రాగం, తినగా తినగా రోగం.

148.అవిత్యాని శరీరాణి అందరిసొమ్మూ మనకేరానీ..

149.అన్నం ఉడికిందో లేదో అంతా పట్టి చూడక్కరలేదు.

150.అన్నం తిన్నవాడు తన్నులు తిన్నవాడు మరిచిపోడు.

151.అన్నదమ్ముల శత్రుత్వం, అక్కచెల్లెళ్ళ మిత్రత్వం.

152.అన్న ద్వేషం బ్రహ్మద్వేషం పనికిరాదంటారు.

153.అన్న వస్త్రాలకు పోతే ఉన్నవస్త్రం కాస్తా ఊడిపోయిందట.

154.అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ అనాచార భయం నాస్తి, తిప్పన్ మూత్రస్య సన్నిధౌ.

155.అబద్ధమాడితే అన్నం పుట్టదు నిజమాడితే నీళ్ళు పుట్టవు.

156.అబ్బడి నెత్తి దిబ్బడు కొడితే దిబ్బడి నెత్తి సుబ్బడు కొట్టాట్ట.

157.అబ్బ బావి తవ్విస్తే అబ్బాయి పూడ్పించాడట.

158.అబ్బురాన బిడ్డ పుడితే ఆముదంతో ముడ్డి కడిగిందట.

159.అబ్బలేని బిడ్డ, గట్లులేని చేను.

160.అభాగ్యుడికి ఆశలెక్కువ నిర్భాగ్యుడికి నిద్ర ఎక్కువ.

161.అమరం నెమరుకు వస్తే కావ్యాలెందుకు కాల్చనా.

162.అమరితే ఆడది అమరకుంటే గాడిది.

163.అమ్మ కడుపు చూస్తుంది ఆలు వీపు చూస్తుంది.

164.అమ్మ కన్న సంతానమంతా నిక్షేప రాయుళ్ళే.

165.అమ్మ పుట్టిల్లు మేనమామ దగ్గరా.

166.అయ్య దేశ సంచారం, అమ్మ గ్రామ సంచారం.

167.అరగని కూడు జరగని మాట.

168.అరచేతిలో బెల్లం పెట్టి మోచేతి వరకూ నాకించినట్లు.

169.అరనిముషం భోగానికి ఆరునెలలు రోగం.

170.అరవం అధ్వాన్నం. తెలుగు తేట, కన్నడం కస్తూరి.

171.అరవలేని దేశం, కాకిలేని ఊరు లేదు.

172.అరవ చాకిరి.

173.అరికాలి ముల్లు చరిలేని గొల్లు.

174.అరువు సొమ్ములు బరువుకు చేటు.

175.అర్జీల వల్ల పనులూ కావు ఆశీర్వాదాల వల్ల బిడ్డలూ పుట్టరు.

176.అత్త మీద కోపం దుత్త మీద చూపించినట్లు.

177.ఆరుద్ర కురిస్తే దారిద్ర్యం లేదు.

178.ఆరుద్ర వానకు ఆర్మాలు పండుతాయంటారు.

179.ఆరునెల్లకు చస్తాడనగా అసలు గుణం మారుతుందట.

180.ఆర్చేవారు లేరు తీర్చేవారు లేరు అడుగున బడితే లేవదీసేవారు లేరు.

181.అడతడి నెత్తి బుడతదు కొడితే బుడతడి నెత్తి బుడ్డోడు కొట్టాట్ట.

182.అలికిన ఇంట ఒలికినా అందమే.

183.అలిగే బిడ్డతో చెలిగే గొడ్డుతో వేగడం కష్టం.

184.అల్పుడెప్పుడు పల్కు ఆడంబరంగాను

185.అల్లుడు చుట్టమూకాడు ఆముదం చెట్టు వృక్షం కాదు.

186.అల్లుడి మంచితనం పొల్లున దంచిన బియ్యం లేవు.

187.అవ్వా కావాలి బువ్వాకావాలి అంటే ఎట్లా?

188.ఆ ఇంటికి తలుపూ లేదు ఈ ఇంటికి ద్వారబంధం లేదు.

189.ఆ ఊరికి ఈ ఊరు ఎంత దూరమో ఈ ఊరికి ఆ ఊరు అంతే దూరం.

190.ఆకులు ఎత్తరా అంటే విస్తళ్ళు లెక్కపెట్టాట్ట.

191.ఆడదానికి మొగవాడు మొగుడు అప్పుల వాడికి షావుకారు మొగుడు

192.ఆడదాని నోట్లో నువ్వు గింజ నానదు.

193.ఆడదై పుట్టేకంటే అడవిలో మానై పుట్టడం మేలు.

194.ఆడ పెత్తనం తంబళ్ళ దొరతనం.

195.ఆముదాల బేరం, కామెర్ల రోగం నమ్మ కూడదు.

196.ఆయానం ఒకరిది అనుభవం మరొకరిది.

197.ఆయుష్షు తీరిన వాడు ఆరు నెల్లకు చస్తే అనుమాన పడే వాడు అప్పుడే చచ్చాట్ట.

198. అయనమ్మా పెళ్ళి అణిగెనమ్మా రంధి.

199.ఆరో కాన్పు ఆడపిల్లయితే అత్తవారింటికి ఇక్కి అట.

200.ఆరుద్రకు అడ్డెడు చల్లితే పునాసకు పుట్టెడు పండుతుందట

201.ఆలికి అదుపు ఇంటికి పొదుపు.

202.ఆలి వంక వారు ఆత్మబంధువులు, తల్లి వంక వారు తగి

నవారు, తండ్రి వంక వారు దాయాదులు.

203. ఆలు ఏడ్చిన ఇల్లు, ఎద్దు ఏడ్చిన సేద్యం ముందుకు రావట.

204. అరు నూరైనా అదంతే.

205. ఆలు లేత, నారు ముదురు కావాలట

206. ఆరోగ్యమే మహాభాగ్యం.

207. ఆవాహనా లేదు, విసర్జనా లేదు.

208. ఆవగింజంత సందుంటే అరవై గారెలు తినేవాడట.

209. ఆవు నలుపైతే పాలు నలుపా.

210. ఆశకు అంతూ లేదు. గోచికి మించిన దరిద్రం లేదు.

211. ఆసనాలు వేస్తే పాసనాలు పుట్టాయట.

212. ఆషాఢ మాసం అరిసెలొండను పొద్దే ఉండదు.

212(a). అడుక్కు తినే అమ్మకు అరవై ఆరు కూరలైతే వండుకున్న అమ్మకు ఒకటే కూర.

212(b). అలిగి అత్తగారింటికెళ్ళేకంటే చెడి చెల్లిలింటికి వెళ్ళడ మేలు.

212(c). అలివిగాని ఆలిని చేసుకొని మురిగి చచ్చేవురా ముండా కొడుకా.

212(d). అయ్యగారిని చెయ్యబోతే కొయ్య గారైనట్లు.

212(e). అభ్యాసం కూసు విద్య

212(f). అడుసు తొక్క నేల, కాలు కడుగనేల

## "ఇ" "ఈ"

213. ఇత్తు ఒకటివేస్తే చెట్టొకటి మొలుస్తుందా!

214.ఇంగువ కట్టిన గుడ్డ బెల్లం వండిన పొయ్యి.
215.ఇల్లు చూసి ఇల్లాలును చూడమన్నారు.
216.ఇల్లు చూస్తే చాలు ఇల్లాలు శుభవృత్తి తెలుస్తుంది.
217.ఇంటి గుట్టు లంకకు చేటు
218.ఇంటికన్నా గుడి పదిలం.
219.ఇంటింటికీ ఒక పొయ్యి మా ఇంటికి మరో పొయ్యి.
220.ఇంటి దీపమని ముద్దాడితే మూతి మీసాలన్నీ తెగ కాలాయట.
221.ఇంటిపేరు కస్తూరి వారు, ఇల్లు గబ్బిలాల కంపు.
222.ఇంటికి దీపం ఇల్లాలే.
223.ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడు.
224.ఇల్లు యిరకటం ఆలి మరకటం.
225.ఇల్లు గుట్టు రోగం రట్టు.
226.ఇంట్లో ఈగల మోత, బైట పల్లకీల మోత.
227.ఇచ్చేవాడు దాత ఇవ్వనివాడు రోత.
228.ఇచ్చేవాడికి పత్రం, చచ్చేవాడికి మందూ అక్కర్లేదు.
229.ఇటుక లాడికి రవిక పెడితే కంపకు పెట్టి చింపుకున్నదట.
230.ఇదిగో పులి అంటే అదిగో తోక అన్నట్లు.
231.ఇన్నాళ్ళూ బ్రతికి ఇంటి వెనుక చచ్చినట్లు.
232.ఇల్లుకట్టి చూడు పెళ్ళిచేసి చూడు.
233.ఇల్లు కాలి ఒకడేడుస్తుంటే ఒళ్ళు కాలి ఒకడేడ్చినట్లు.
234.ఇంటగెలిచి రచ్చ గెలవమన్నాడు.
235.ఇల్లుపీకి పందిరి వేసినట్లు.
236.ఇసుక తక్కెడ పేడ తక్కెడ.
237.ఇస్తే పెళ్ళి ఇవ్వక పోతే పెటాకులు.

238. ఇంటి వాడిలా చేసేవాడు బయటివాడిలా తినేవాడు.

239. ఇచ్చింది ఇచ్చి పుచ్చిన దాన్ని కొన్నట్లు.

240. ఇచ్చేవాణ్ణి చూస్తే చచ్చేవాడైనా లేస్తాట్ట.

241. ఇద్దరు పెళ్ళాల మొగుడు ఇరుకున పడి చచ్చాట్ట.

242. ఇట్టిని చూసి బట్టె వాతపెట్టు కున్నట్లు.

243. ఇరుగు ఇంగలం పొరుగు మంగలం.

244. ఇరు పోటీల ఇల్లు చెడుతుంది, వాత నొప్పుల ఒళ్ళు చెడు తుంది.

245. ఇరుసున కందెన పెట్టక పరమేశ్వరుడి బండైనా పారదు.

246. ఇల్లరికం కన్నా మాలరికం మేలు.

247. ఇల్ల నారాయణమ్మ అంటే వెళ్ళు గోవిందా అన్నట్లు.

248. ఇల్లు అలుకగానే పండగైందా

249. ఇల్లు ఇందు వారం, పొయ్యి బుధవారం.

250. ఇల్లు కాలిపోతూంది ఈ(రాజూ అంటే నాదేం పోయింది నరసరాజూ అన్నాట్ట.

251. ఇష్టమైన వస్తువు ఇంగువతో సమానం.

252. ఇష్టారాజ్యం భరతుడి పట్టం.

253. ఇల్లే తీర్థం, వాకిలే వారణాసి, కదుపే కైలాసం.

254. ఈ కంటికి ఈ రెప్పలడ్డమా.

255. ఈత వచ్చిన వాడికి లోతులేదు.

256. ఈత చెట్టు క్రింద నిల్చొని పాలు త్రాగినా కల్లే నంటారు.

257. ఈనగాచి నక్కల పాలు చేసినట్లు.

258. ఇంటి వెనకాల ఇంగువ చెట్టు ఎంత కోసినా గుప్పెడు కాదు.

259. ఇస్తినమ్మ వాయనం పుచ్చుకుంటినమ్మ వాయనం అన్నట్లు.

260. ఇంటి గుట్టు రచ్చకెక్కినట్లు.

261. ఈ ఊరి రెడ్డి పొరుగూరికి పాలి కాపు.

262. ఈ ఊళ్ళో పెద్ద లెవరంటే తాళ్ళు, దాత లెవరంటె చాకళ్ళు అన్నట్లు.

263. ఈనాడు ఇంట్లో రేపు మంట్లో.

264. ఈ వేలుకు ఆ వేలు ఎడం.

265. ఇవ్వాళ చస్తే రేపటికి రెండు.

266. ఈడు చూచి పిల్ల నివ్వు పిడి చూచి కొడవలివ్వు.

267. ఈత చెట్టు ఇల్లూకాదు తాటి చెట్టు తల్లీకాదు.

268. ఈ ఇంటికాకి ఆ ఇంటి మీద వాలదు.

269. ఇస్తే చెడేదీ లేదు చస్తే వచ్చేదీ లేదు.

270. ఇంగువ కట్టిన గుడ్డ వాసనపోదు.

271. ఈరు తీస్తే పేను వచ్చినట్లు.

272. ఈ నెల వడ్డీ లేదు వచ్చే నెల అసలూలేదు.

273. ఇంట్లో వస్తు, బయట వస్తు.

274. ఇస్తే పెళ్ళి, ఇవ్వకపోతే పెటాకులు.

275. ఇల్లు వెళ్ళగొడితే విడుపుల శృంగారం, మొగుడు వెళ్ళగొడితే మొత్తల శృంగారం.

276. ఈడ్చు కాళ్ళ వాడికి ఇద్దరు భార్యలు ఒకటి ఈడువ. ఒకటి ఏడవ.

## "ఉ" "ఊ"

277. ఉంటే లిక్కి, పోతే కొడవలి.

278. ఉంటే ఊరు లేకపోతే పాడు.

279. ఉండనిస్తే పండుతుంది ఊడదీస్తే ఎండుతుంది.

280. ఉన్నది గట్టు పోయింది పొట్టు.

281. ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గాని కెక్కుతుందా?

282. ఉడకకే ఉడకకే ఓ ఉల్లిగడ్డా నీ వెంత ఉడికినా నీ కంపుపోదు.

283. ఉడతా భక్తి.

284. ఉత్త చెవికన్నా తాటాకు చెవి మేలు.

285. ఉత్త ముండకన్నా అత్త ముండ మేలు.

286. ఉత్తర కుమార ప్రజ్ఞలు

287. ఉత్తరచూసి ఎత్తర గంప

288. ఉత్తర ఉరిమినా, పాము తరిమి కరిచినా తిరగదు

289. ఉద్యోగం పురుషలక్షణం అదిపోతే అవలక్షణం

290. ఉన్నమాటంటే ఉలుకెక్కువ

291. ఉన్నవాడు, ఊరికిపెద్ద చచ్చినవాడు కాటికి పెద్ద

292. ఉపకారానికి పోతే అపకారం వచ్చినట్లు

293. ఉపాధ్యాయుల వారు ఏం చేస్తున్నారు అంటే రాసిన తప్పులు దిద్దుకుంటున్నారట.

294. ఉప్పుతో ముప్పై ఆరు ఉంటే ఉత్తముండైనా వండుతుంది

295. ఉప్పువాడు చెడే, పప్పువాడు చెడే, తమలపాకులవాడు తమాం చెడే

296. ఉయ్యాల్లో బిడ్డనుంచి ఊరంతా వెతికినట్లు

297. ఉరుకు ఉరుకు మనే వారే కాని కూడా ఉరికేవారు లేరు

298. ఉల్లిచేసిన మేలు తల్లి చేయదు

299. ఊరందరిది ఒక దోవ, ఉలిపి కట్టెది ఒక దోవ

300. ఊరంతా నాన్నకు వణికితే నాన్న అమ్మకు వణికాట్ట

301. ఊరి జబ్బు చాకలి ఎరుగు, ఉద్యోగి జబ్బు బంట్రోతు ఎరుగు

302. ఉరుమురిమి మంగలం మీద పడ్డట్టు

303. ఊరు పొమ్మంటుంది, కాడు రమ్మంటుంది

304. ఊళ్ళేలే కొమరుడి కన్నా ఉపాదాన మెత్తే పెనిమిటి మేలు

305. ఊరి ముందరి దాకా వచ్చి పెళ్ళాం బిడ్డలు ఎట్లున్నారని అడిగాట్ట

306. ఉండ ఇల్లూ లేదు, పండ మంచమూలేదు

307. ఉంచుకున్నవాడు మొగుడూకాదు, పెంచుకున్నవాడు కొడుకూ కాదు

308. ఉంటే అమీరు, లేకుంటే పకీరు

309. ఉండడానికి స్థలమిస్తే పండుకోను మంచ మడిగాట్ట

310. ఉచ్చ గుంటలో చేపలు పట్టినట్లు

311. ఉట్టిమీద కూడు, ఊరిమీద నిద్ర

312. ఉద్యోగికి దూరభూమిలేదు

313. ఉన్నది పోదు, లేనిదిరాదు

314. ఉన్నదీ పోయింది, ఉంచుకున్నదీ పోయింది.

315. ఉన్నదే మనిషికి పుష్టి, తిన్నదే వవరానికి పుష్టి

316. ఉన్నవాడు ఉన్నవాడికే పెట్టే, లేనివాడూ ఉన్నవాడికే పెట్టే.

317. ఉపాయం చెప్పవయ్యా అంటే ఉరితాడు తెచ్చుకో అన్నాట్ట.

318. ఉభయ భ్రష్టత్వం, ఉపరి సన్యాసం

319. ఉమ్మడి బేరం, ఉమ్మడి సేద్యం ఉభయులకూ చేటు

320. ఉరిమిన మబ్బు కురవక మానదు

321.ఉల్లి మల్లి కాదు, ఉంచుకున్నది పెళ్లామూ కాదు

322.ఊరిక రారు మహాత్ములు

323.ఊరి మొహం గోడలే చెపుతాయి

324.ఊరికే పెట్టే అమ్మను నీ మొగుడితో పాటు పెట్టమన్నట్లు

325.ఊరినిండా అప్పులూ, తలనిండా బొప్పులు

326.ఊరి ముందరి చేను కాకుల్లపాలు, ఊళ్లో వియ్యమ్మ కయ్యముల పాలు

327.ఊళ్ళో పెళ్లైతే కుక్కలకు హడావుడిలాగా

328.ఊసర క్షేత్రంలో పైరు, నీళ్ళులేని చెరువు క్రింద సేద్యం

329.ఊరికి పొయ్యేవాడికి లేకపోయినా బహిర్భూమికి వెళ్లేవాడికి భత్యం కట్టమన్నాట్ట.

330.ఊళ్ళో అధికారమైనా ఉండాలి, ఊరంచున పొలమైనా ఉండాలి

## ఋ

331.ఋణము, వ్రణము ఒకటే

332.ఋషి మూలం, నది మూలం, స్త్రీ మూలం విచారించరాదు

## ఎ ఏ ఐ

334.ఎంగిలికి ఎగ్గులేదు, తాగుబోతుకు సిగ్గులేదు

335.ఎంగిలి చేత్తో కాకిని కూడా తోలని వాడు భిక్షం పెడతాడా

336.ఎండాకాలంలో ఏకులు వడికి వానాకాలంలో వడ్లు దంచినట్లు

337.ఎండా, వానా కలిసివస్తే కుక్కలకూ నక్కలకూ పెళ్ళి.

338.ఎంత చెట్టుకు అంత గాలి

339.ఎంత దయో దాసులపై
340.ఎంత పెరిగినా గొర్రెకు బెత్తెడే తోక
341.ఎంత పొద్దుండగా లేచినా తుమ్మగుంట వద్దనే తెల్లారుతుంది.
342.ఎంత ప్రాప్తమో అంతే ఫలం
343.ఎంతలావు మొగడైనా ఆడదానికి లోకువే
344.ఎంతవారలైనా కాంతదాసులే
345.ఎక్కడున్నావే గొంగళి అంటే వేసిన చోట ఉన్నాను కంబళీ అన్నదట
346.ఎక్కడా దిక్కు లేక పోతే అక్క మొగుడే దిక్కు
347.ఎక్కడకు పోతావు విధవమ్మా అంటే వెంటవస్తాను పద వమ్మా అన్నదట
348.ఎద గొడ్డుకు బెదరుండదు
349.ఎద్దు ఏమెరుగురా అటుకుల రుచి గాడిద ఏమెరుగురా గంధపు వాసన
350.ఎముక లేని చెయ్యి
351.ఎలుక తోలు తెచ్చి ఎందాక ఉతికినా నలుపు నలుపే కాని తెలుపు కాదు
352.ఎవడి కంపు వాడి కింపు
353.ఎవడు తవ్వుకున్న గోతిలో వాడే పడతాడు
354.ఎవడబ్బ సొమ్ముకురా ఎక్కెక్కి ఏడ్వడం
355.ఎవడి పిచ్చివాడికానందం
356.ఎవరికి వారే యమునా తీరే
357.ఎవరివల్ల చెడ్డావోయి పీరన్నా అంటే నోటి వల్ల చెడ్డానోయ్ పీరన్నా అన్నాట్ట

358.ఎంత మంచి గొల్లవాడికైనా వేపకాయంత వెర్రి ఉంటుంది
359.ఎక్కిరించబోయి వెల్లకిల పడ్డాట్ట
360.ఎక్కితే గుర్రపు రౌతు, దిగితే కాళ్ళుంటు
361.ఎదట అన్నది మాట, ఎదాన పెట్టింది రాత
362.ఎదుట ఉన్నవాడే పెండ్లి కొడుకు
363.ఎద్దు నెక్కిన వాడు లింగడు, గద్ద నెక్కిన వాడు రంగడు
364.ఎద్దు పుండు కాకికి ముద్దా
365.ఎద్దు ఈనిందంటే కొట్టాన కట్టమన్నట్టు
366.ఎద్దు ఎండకు లాగ, దున్న నీడకు లాగ
367.ఎనుబోతు మీద వానకురిసినట్లు
368.ఎరువుల సొమ్ము బరువుచేటు, తీయ, పెట్ట తీపుల చేటు, అందులో ఒకటి పోతే అప్పుల చేటు
369.ఎలక్కు పిల్లి సాక్ష్యం
370.ఎవరి పైగుడ్డ వారికి బరువా
371.ఏట్లో పారే నీళ్ళు ఎవరు త్రాగితే నేం
372.ఏనుగంత తండ్రి ఉండటం కన్నా ఏకంత తల్లి ఉండటం మేలు
373.ఏనుగ మింగిన వెలగపండు
374.ఏ పుట్టలో ఏ పామున్నదో
375.ఎంత చేసినా, సమకాలంవారు మెచ్చరు కదా
376.ఏమీ లేనమ్మకు ఏడ్పుల శృంగారం, కలిగినమ్మకు కదుపుల శృంగారం
377.ఏరు ఏడామడ ఉండగనే పంచవిప్పి చంకన పెట్టుకొని పోయినట్లు

379.ఏరు దాటి తెప్ప తగలేసినట్లు

380.ఏరు ముందా, ఏరువాక ముందా?

381.ఏలడానికి ఊళ్ళులేక పోయినా, ఎత్తుకు తినడానికి ఎన్నో

382.ఏటి ఈతకు, లంక మేతకు సరి

383.ఏరు ఎన్ని వంకలు తిరిగినా చివరకు సముద్రంలో పడాల్సిందే

384.ఏపాటు తప్పినా పాపాటు తప్పదు

385.ఎవరి పాపాన వాళ్లే పోతారు

386.ఏడ్చేదాని మొగుడొస్తే నా మొగుడొస్తాడు

387.ఏలేవాడి ఎద్దు పోతేనేం, కాసేవాడి కన్నుపోతేనేం

388.ఐసా పైసా

389.ఐశ్వర్యానికి అంతులేదు

## ఒ ఓ ఔ

389.ఒక కంచాన తిని ఒక మంచాన పడుకునేవారు.

390.ఒక కంట మన్నం ఒక కంట వెన్న పెట్టుకున్నట్లు.

391.ఒకరిద్దర్ని చంపితేకాని వైద్యుడు కాడు.

392.ఒక వరలో రెండు కత్తులిమడవు.

393.ఒకరి కలిమికేడిస్తే ఒక కన్ను పోయింది. తన కలిమికేడిస్తే రెండోకన్ను పోయింది.

394.ఒక్కపూట తినేవాడు యోగి, రెండు పూటలా తినేవాడు భోగి, మూడు పూటలా తినేవాడు రోగి.

395.ఒకవాడు ధారణ, ఒకనాడు పారణ.

396.ఒక కొడుకు కొడుకూ కాదు. ఒక కన్ను కన్నూ కాదు

397.ఒళ్ళు మిడిసిన్న కాకి మొట్టెలకు కంది పోయిందట.
398.ఒక చెంప కొడితే పాలు, ఒక చెంప కొడితే నీళ్ళు.
399.ఒక చేత పసుపు, ఒక చేత ముసుగు.
400.ఒక చెయ్యి తడితే చప్పుడవుతుందా?
401.ఒక చేతి వేళ్ళే ఒకటిగా లేవు.
402.ఒకణ్ణి చూస్తే పెట్టబుద్ధి. ఇంకొకణ్ణి చూస్తే మొట్టబుద్ధి.
403.ఒకనాటి భోగం ఆరునెల్ల రోగం.
404.ఓటి కుండలో నీళ్ళు పోసినట్లు.
405.ఓడ ఎక్కేదాకా ఓడ మల్లన్న, ఓడ దిగాక బోడి మల్లన్న.
406.ఓడలు బండ్లవుతాయి, బండ్లు ఓడలవుతాయి.
407.ఓపలేని అత్తకు ఒంగలేని కోడలు.
408.ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెళ్ళాడితే పొంత కుండలన్నీ పగుల గొట్టిందట.
409.ఒక్క దెబ్బకు రెండు పిట్టలు.
410.ఒక్కొక్క రాయి తీస్తుంటే కొండైనా తరుగుతుంది.
411.ఒజ్జల పుచ్చకాయ.
412.ఒల్లని మొగుడికి తలంబ్రాలు పోసినట్లు.
413.ఒళ్ళో గింజలున్నా వద్ద భార్య ఉన్నా ఊరుకోబుద్ధికాదు.
414.ఒళ్ళో పెడుదునా, దళ్ళో పెడుదునా అన్నట్లు.
415.ఓడు ఓడంటే కంచమంతా ఓడన్నట్లు.
416.ఒక ఊరి కాపు, మరొక ఊరికి వెట్టి.
417.ఔనన్నా కాదన్నా అత్తకే అధికారం కాని కోడలికేముంది?
418.ఔషధం కానిది అవనిలో లేదు.
419.ఒకటి చెయ్యబోతే మరొకటి అయినట్లు.

420. ఒకనాటి పెళ్ళికి మొగమంతా కాటిక.

421. ఓపలేని అత్తకు ఒంగలేని కోడలు.

422. ఓంకారం రానివాడు ఒంట్లు గుణించినట్లు.

## క కా కు ఖ

423. కంచం అమ్మి మెట్టెలు కొన్నట్లు.

424. కంచు మ్రోగినట్లు కనకమ్ము మ్రోగునా.

425. కంటికి రెప్ప, కాలికి చెప్పు.

426. కంఠ గీత ప్రాణం.

427. కళ్ళార్పే అమ్మ ఇల్లార్పుతుంది.

428. కందకు లేని దురద కత్తిపీటకెందుకు?

429. కంబళ్ళో తింటూ రోమాలు లెక్కించినట్లు.

430. కక్కిన కూటికి ఆశపడ్డట్లు.

431. కట్టె వంక పొయ్యి తీరుస్తుంది.

432. కడవంత గుమ్మడి కాయైనా కత్తిపీటకు లోకువే.

433. కడుపు కూటికేడిస్తే కొప్పు పూల కేడ్చిందట.

434. కడుపు నిండిన బేరం.

435. కడుపు నిండిన వాడికి గారెలు చేదు.

436. కడుపులో లేంది కావలించుకుంటే వస్తుందా?

437. కతల మారి మొగుడు కమ్మలు చేయిస్తే అప్పుల కూటి మొగుడు అమ్ముకు తిన్నాట్ట.

438. కతికితే అతకదు.

439. కత్తిపోటు తప్పినా కలం పోటు తప్పదు.

440. కథకు కాళ్ళు లేవు, ముంతకు చెవులు లేవు.

441. కథ కంచికి, మన మింటికి.

442. కననిది బిడ్డాకాదు, కట్టంది బట్టాకాదు.

443. కమ్మగుట్టు గడపదాటదు.

444. కమ్మని, తుమ్మని నమ్మరాదు.

445. కర్ణుడు లేని భారతం, శొంఠి లేని కషాయం.

446. కర్రలేని వాణ్ణి గొర్రె అయినా కరుస్తుంది.

447. కలవారి ఆడపడుచుకు కాకర కాయైనా కానరాదు.

448. కలహమున్న కొంపలో కట్టుబట్టలుండవు.

449. కలవారి ఇంటికి కటగొట్టు కోడలు కన్నా పేదవారింటికి పెద్దకోడలవడం మేలు.

450. కలిగిన వారికి అందరూ చుట్టాలే.

451. కలిమిలేములు కావడి కుండలు.

452. కల్పవృక్షం క్రింద గచ్చపొద, మంచి గంధం చుట్టూ నాగు పాము.

453. కత్తికి మెత్తన, అత్తకు మంచి లేదు.

454. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది.

455. కట్టిన ఇల్లు, పెట్టిన పొయ్యి.

456. కట్టుకున్న మొగుడు, పెట్టుకున్న నగలు.

457. కంది పండితే కరువు తీరుతుందట.

458. కంసాలి కూడు కాకులు కూడా ముట్టవు.

459. కట్టుకున్న భార్య అయినా చెయ్యాలి. కన్నతల్లి అయినా చెయ్యాలి.

460. కడచిన దానికి వగచిన లాభమేమిటి?

461. కడుపా, చెరువా ?

462.కడుపు కాలి ఏడుస్తుంటే మనోవర్తి ఏమిస్తావన్నదట.

463.కడుపులో ఉన్నమ్మ కనక మానదు, ఒండుకున్నమ్మ తినక మానదు.

464.కడుపే కైలాసం, ఇల్లే వైకుంఠం.

465.కత్తి మీద సాము.

466.కదిపితే కందిరీగల తుట్టె.

467.కదిలిస్తే గచ్చపొద.

468.కదుర్యా కవ్వం ఆడితే కరువే లేదు.

469.కథలెల్లా పెతలాయె, కాపురాలు రెండాయె.

470.కన్నతల్లి కైనా కనుమరుగుండాలి.

471.కన్నతల్లి తట్టి గమిడిదాటదు.

472.కన్నతల్లిని కాళ్ళు పట్టి ఈడ్చి, పినతల్లికి పిండప్రదానం చేసి నట్లు.

473.కన్నతల్లి బంగారమైనా కంసాలి వదలడు.

474.కనుముకి కాకర, భోగికి పొట్ల.

475.కనుమ నాడు కాకైనా ప్రయాణం చెయ్యదు.

476.కన్నేల పోయెరా కనక లింగమా అంటే చేసుకున్న కర్మరా శంభు లింగమా అన్నాట్ట.

477.కయ్యానికైనా, వియ్యానికైనా సమ ఉజ్జీ ఉండాలి.

478.కరణానికి తిట్టుదోషం, చాకలికి ముట్టుదోషం లేదు.

479.కరణాన్ని, కంసాలిని కాటికి పోయినా నమ్మరాదు.

480.కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం.

481.కర్ర విరగకుండా, పాము చావకుండా.

482.కరిమింగిన వెలగపండు.

483. కక్కొచ్చినా, కళ్యాణమొచ్చినా ఆగదు.

484. కష్టాలు కలకాలం కాపురముండవు.

485. కంచి గరుడసేవ.

486. కాంత, కనకాలే కయ్యానికి మూలం.

487. కాకి గూటిలో కోకిలలాగా.

488. కాకి పిల్ల కాకికి ముద్దు.

489. కాలే కడుపుకు మండే గంజి.

490. కార్తెముందర ఉరిమినా, కార్యం ముందు తొందరపడినా చెడుతుంది.

491. కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు.

492. కామున్నది కాక మానదు.

493. కష్టపడి ఇల్లుకట్టి, కల్లుతాగి తగుల బెట్టినట్లు.

494. కవిత నేర్పు యతి కూర్పే చెపుతుంది.

495. కాకి గోల.

496. కాచిన చెట్టుకే కర్ర దెబ్బలు.

497. కామమ్మ మొగుడంటే కాబోలు అనుకున్నాను, కాదంటే కావడి, కుండలు ఒకటేయుండి.

498. కామానికి కళ్ళు లేవు. గుడిసేటికి గుణమూ లేదు.

499. కాలం, కర్మం కలిసి రాకపోతే కమల బాంధవుడి కైనా కష్టాలు తప్పవు.

500. కలిసివచ్చే కాలానికి నడిచి వచ్చే బిడ్డలు పుడతారు.

501. కందం చెప్పిన వాడే కవి, పందిని పొడిచిన వాడే బంటు.

502. కందకు లేని దురద చామకెందుకు.

503. కరువులో అధిక మాసం.

504. కన్ను ఎర్రబడ్డా, మిన్ను ఎర్రబడ్డా కారక మానదు.

505. కన్ను చూసి కాటుక, పిర్ర చూసి పీట.

506. కన్నీల పోయెనోయి కనక లింగమా అంటే చేసుకున్న కర్మ పోయె శంభులింగమా అన్నాట్ట.

507. కర్మ ఛండాలుడి కంటే జాతి ఛండాలుడు మేలు.

508. కర్ర వంక పొయ్యి తీరుస్తుంది.

509. కలకాలం బతికినా కాటికి పోక తప్పదు.

510. కలలో జరిగింది ఇలలో జరగదు.

511. కలిపి కొట్టరా కావేటి రంగా.

512. కలిమి ఉన్నంత సేపు బలగం, కండ ఉన్నంతసేపే మిండడు.

513. కలుపు తీసిన చేను కనుల పండుగ.

514. కవితకు మెప్పు, కాంతకు కొప్పు అవసరం.

515. కష్టం కూలీది, ఫలితం కామందుది.

516. కష్టపడి సుఖపడమన్నాడు.

517. కాకిపిల్ల కాకికి ముద్దు.

518. కాకి ముక్కుకు దొండపండులాగ.

519. కాకుల్ని కొట్టి గద్దలకు వేసినట్లు.

520. కాకుల్లో తెలుపు, అల్లుళ్ళలో మంచీ ఉండదు.

521. కాకై కలకాలం ఉండేకంటే హంసై ఆరునెలలున్నా చాలు.

522. కానున్నది కాక మానదు. రానున్నది రాక మానదు.

523. కామిగాక మోక్ష కామిగాడు.

524. కారణం లేని కార్యం, పూర్ణం లేని బూరె, వీరణం లేని పెళ్ళి ఉండవు.

525. కార్యం వాడు తలొంచుకుంటే కలకాలం తలెత్తుకు తిరగ

పచ్చు.

526.కాలికి చుట్టుకున్న పాము కరవక మానదు

527.కాలికి దూరమైతే కంటికి దూరమా.

528.కాలికోసం చెప్పులు ఒళ్ళో పెట్టుకోవాలి.

529.కాలికి వేస్తే వేలికి, వేలికి వేస్తే కాలికి.

530.కాలు కాలిన పిల్లిలాగా.

531.కాలు, చెయ్యి ఉన్నంత కాలం కాలం గడుస్తుంది.

532.కాలు జారితే తీసుకోగలం గాని నోరు జారితే తీసుకోగలమా.

533.కాలు పట్టుకొని లాగితే చూరు పట్టుకొని వేళ్ళాడినట్లు.

534.కాలు తొక్కిన వేళ, కంకణం కట్టిన వేళ మంచిది కావాలి.

535.కాళ్ళ దగ్గర కొచ్చిన బేరం కాశికి వెళ్ళినా దొరకదు.

536.కాళిదాసు కవిత్వం కొంత నా పైత్యం కొంత.

537.కాశికి పోయినా కర్మం తప్పదు.

538.కానుకు గతిలేదు. కోటికి కొడి వేశాట్ట.

539.కాలబెట్టి నేల రాచినట్లు.

540.కర్రలేని వాణ్ణి గొర్రైనా కరుస్తుంది.

541.కాలు కాలిన పిల్లి.

542.కాస్త ఓడంటే కంచమంతా ఓడన్నట్లు.

543.క్రింద పడ్డా పై చెయ్యి అన్నట్లు.

544.కీలెరిగి వాత వీలెరిగి మాట.

545.కీడెంచి మేలెంచ మన్నారు.

546.కుంచాలమ్మ కూడబెడితే మంచాలమ్మ మాయం చేసిం
దంట.

547.కుంజర యూధమ్ము దోమ కుత్తుక జొచ్చినట్లు.

548.కుక్క కాటుకు చెప్పు దెబ్బ.

549.కుక్కకు పెత్తనమిస్తే కుండలు కెలకదా!

550.కుక్క గోవు కాదు, కుందేలు పులీ కాదు.

551.కుక్కతోక పట్టి గోదావరీదినట్లు.

552.కుక్క తోక ఎప్పుడూ వంకరే.

553.కుక్కను చంపిన పాపం గుడికట్టినా పోదు.

554.కుక్క ముట్టిన కుండ అక్కరకు రాదు.

555.కుడితే తేలు, కుట్టకుంటే కుమ్మరి పురుగు.

556.కుడిచి కూర్చున్నమ్మ కూతురి పిర్రలు తెగ చెక్కిందట.

557.కుడిచేత చేసిన దానం ఎడమచెయ్యి ఎరగరాదు.

558.కుదిరింది వైద్యం, మానింది మందు.

559.కుమ్మరికి కుండ కరువు, సాలెకు బట్ట కరువు

560.కుర్రకాకికి ఏమి తెలుసురా ఉండేలు దెబ్బ.

561.కులమింటి కోతైనా మేలు.

562.కులమెరిగి చుట్టం, స్థలమెరిగి వాసం.

563.కుల విద్యకు సాటిలేదు గువ్వలచెన్నా.

564.కూచిపూడి కుక్క మొరిగినా సంగీతమే.

565.కూర్చుంటే లేవలేదు, కూటి కుండ దించలేదు వాడు కొట్టొస్తాడే, నాకు నవ్వొస్తదే.

566.కూటికి తక్కువైనా కులానికి తక్కువా.

567.కూటికోసం కోటి విద్యలు.

568.కూరకు తాలింపు, గుడ్డకు జాడింపు.

569.కూర్చొని తింటుంటే కొండైనా కరిగిపోతుంది.

570.కూర్చొన్న వాడికి కుప్పలు, తెలియని వాడికి తిప్పలు.

571.కూసే గాడిద వచ్చి మేసేగాడిదను చెడగొట్టిందట.

572.కృష్ణాస్నానానికి కొండుభొట్లు ఆజ్ఞా.

573.కొంగకు ఒక చెరువు లేదు, కోమటికి ఒక ఊరూ లేదు.

574.కొంగ జపం చేపల కోసమే.

575.కొండంత దేవుడికి కొండత పత్రి పెట్టగలమా.

576.కొంగు తగిలితే చాలు, కోటి వరహాలు.

577.కొండ అద్ద మందు కొంచమై ఉండదా.

578.కొండ కట్టెలు, కోనేటి నీళ్ళు మోసినట్లు.

579.కొండకు వెంట్రుక కడితే వస్తే కొండ వస్తుంది, పోతే వెంట్రుక పోతుంది.

580.కొండనాలికకు మందువేస్తే ఉన్ననాలిక ఊడిందట.

581.కొండ మంగలాడు గొరిగినట్లు.

582.కొట్టినా వంగని కొడుకు, తిప్పినా తిరగని మీసం వ్యర్థం.

583.కుంటి కులాసం, ఇంటికి మోసం.

584.కుందేటి కొమ్ము.

585.కుడువబోతూ కూరాకు రుచి అడిగినట్లు.

586.కొండను తవ్వి ఎలుకను పట్టినట్లు.

587.కొండవీటి చేంతాడు.

588.కొత్తాక వింత పాతాక రోత.

589.కొత్త బిచ్చగాడు పొద్దెరగడు.

590.కొన్నది వంకాయ, కొసిరేది గుమ్మడికాయ.

591.కొరివితో తల గోక్కున్నట్లు.

592.కోడలికి బుద్ధి చెప్పి అత్త రంకు పోయిందట.

593.కోడలు కొడుకును కంటానంటే వద్దనే అత్త ఉంటుందా!.

594. కోతికి కొబ్బరికాయ దొరికినట్లు.

595. కోతి పుండు బ్రహ్మరాక్షసి.

596. కోమటి సాక్ష్యం.

597. కోడిగుడ్డంత బంగారం లేనివాడున్నాడా?.

598. కోడీ, కుంపటీ లేకపోతే తెల్లవారదా?

599. కోమటికి లేమి కంసాలికి కలిమి ఉండదు.

600. కులం తప్పినవాడు బంతికి ముందు, కూరగాయలవాడు సంతకు ముందు.

601. కూనలు కూటికేడుస్తుంటే, అవ్వరంకు మొగుడికేడ్చిందట.

602. కూలి ఎంతైనా కూడుకాదు.

603. కూరిమి కల దినములలో నేరము లెన్నడు కలుగనేరవు

604. కూలి చేస్తే గడవంది కూర్చుంటే గడుస్తుందా.

605. కూసుముండ నోరు కుట్టి పెట్టినా నిలవదు.

606. కృత్తికలో విత్తితే, కుత్తుకలు నిండవు.

607. కొంగు తడిస్తే చలిగాలి కోకంతా తడిస్తే చలేమిటి.

608. కొండ మంగలి క్షవరం.

609. కొండలు మింగేవాడికి గోపురాలడ్డమా.

610. కొండమీద గోలేమిటంటే కోమట్ల రహస్యాలన్నాట్ట.

611. కొండలా వచ్చి మంచులా తేలినట్లు.

612. కొండవీటి చాంతాడు.

613. కొంప తీస్తావా రామన్నా అంటే అందుకు సందేహమా అన్నాట్ట.

614. కొంగకు ఒక చెరువూ లేదు, కోమటి కాక ఊరూలేదు.

615. కొండంత మొగుడు పోగా పిడికెడు బొచ్చుకేడ్చిందట.

616.కొంప అంటుకుపోతుంటే నీళ్ళ బాన నిప్పు దగ్గర పెట్టిందట.

617.కొక్కిరాయి, కొక్కిరాయి ఎందుకు పుట్టావంటే చక్కని వాళ్ళను ఎక్కిరించడానికి అన్నదట.

618.కొడుకు మనవాడైనా కోడలు మనదవుతుందా.

619.కొడుకు ముద్దు, కోడలు మొద్దు.

620.కొత్త అప్పుకు పోతే పాత అప్పు పైన పడిందట.

621.కొత్త ఆవకాయ, కొత్త పెళ్ళాము రుచి.

622.కొత్తగా సిరివస్తే, అర్ధరాత్రి గొడుగు పట్టమన్నాట్ట.

623.కొత్త వైద్యుడి కన్నా పాతరోగి మేలు.

624.కొన్నాళ్ళు చీకటి, కొన్నాళ్ళు వెన్నెల.

625.కొప్పు ఉన్నామె ఎటు తిప్పినా అందమే.

626. కొమ్ములు చూచి బేరమాడినట్లు.

627.కొయ్యరా కొయ్యరా పోలిగా అంటే టంగుటూరి మిరియాలు తాటికాయంత అన్నట్టు.

628.కో అంటే కోటిమంది.

629.కోటలో పాగా వేసినట్టు.

632.కోడలా కోడలా నీభోగమెన్నాళ్లే అంటే మా అత్తే మాల పల్లికి పోయొచ్చిందాకా.

633.కోడలు కొట్టిన కుండ కొత్త కుండ, అత్త కొట్టిన కుండ అడుగోటి కుండ.

634.కోతికి పుండైతే గోకా నాకా.

635.కోర్టు కెక్కిన వాళ్ళు ఒకడు ఆవుకొమ్మును పట్టుకుంటే ఇంకొకడు తోక పట్టుకుంటే మధ్య వకీలు పాదుగు దగ్గర కూర్చున్నాట్ట.

636.కోరి పిల్ల నిస్తామంటే కులం తక్కువ అన్నాట్ట.

637.కోల ఆడితే కోతి ఆడుతుంది.

638.ఖానా నహీ ఎల్లీకి బులావ్.

639.కూపస్థమండూకం.

## గ గా గు గే గో

639.గంగగోవు పాలు గంటెడైనను చాలు కడివిడైనను ఏమి ఖరము పాలు

640.గంగకు ఇద్దరి మేలు, అద్దరి కీడునుంగలదే.

641.గంగకు, సొంగకు, ఒంగకు తప్పలేదు

642.గంగ స్నానం తుంగా పాశం.

643.గంజాయి వనంలో తులసిమొక్కలాగా

644.గంజిలోకి ఉప్పేలేకుంటే పాలల్లోకి పంచదార కావాలన్నాట్ట.

645.గండం గడిచి పిండం బయట పడినట్లు.

646.గంతకు తగిన బొంత.

647.గంతా బొంతా కలిసి గాడిద మోతైనట్లు

648.గచ్చ పొదలాగా

649.గజం మిథ్య, పలాయనం మిథ్య అన్నట్టు

650.గడ్డి ఉన్నవాడికి లజ్జ ఉండనట్లు

651.గట్టిని విడిచి పొట్టుకు పోరాడినట్లు

652.గడించే దొకడు, గుణించే దొకడు

654.గయ్యాళి, గచ్చపొద ఒకటే.

654.గరుడాయ లెస్స అంటే శేషాయలెస్స అన్నాట్ట.

655.గాజుల బేరం భోజనానికి సరి.

656.గాడి తప్పిన బండి లాగా

657.గాడిదకు గడ్డివేసి ఆవును పాలిమ్మన్నట్లు

658.గాడిద గుడ్డు గరుడ స్తంభం

659.గాడిద పిల్ల కోమలం

660.గాడిద పుండుకు బూడిద మందు

661.గాఢాలింగన సౌఖ్యం, ప్రౌఢాంగన ఎరుగుగాని బాల ఏమెరుగు?

662.గాదెక్రింద పంది కొక్కులాగా

663.గాదెలో గింజలు గాదెలో ఉండాలి బిడ్డలు మాత్రం దుడ్డుల్లాగా ఉండాలి.

664.గాలికి పుట్టి ధూళికి పెరిగినట్లు

665.గాలికి పోయే కంపను కాలికి తగిలించుకున్నట్లు

666.గాలికి పోయిన పేలపిండి రామార్పణమన్నట్లు

667.గాలిపాటు, కలిమితేట

668.గాలిని మూటగట్టినా గయ్యాళి నోరు కట్టలేరు

669.గాలిలో దీపం పెట్టి దేవుడా నీ మహిమన్నట్లు

670.గాలి మేడలు కట్టినట్లు

671.గతిలేనమ్మకు గంజే పానకం

672.గానుగలో చెయ్యిపెట్టి పెరుమాళ్ళు కృప అన్నాట్ట.

673.గంగలో అస్థికలు గయలో పిండం

674.గంగలో మునిగినా కాకి హంస అవుతుందా.

675.గంజి తాగినా లంజ కావాలన్నాట్ట

676.గంధపు పొడి పోసినా గాడిద గాడిదే

677.గత జల సేతు బంధనం

678.గతించిన దానికి చింతించిన ఏల

679.గద్దెకు పోతే సుద్దులకు తక్కువే.

680.గర్భాదానంనాటి కబుర్లు లంఖణాలలో తలచుకున్నట్లు.

681.గాడిదకేం తెలుసు గంధపు పొడి వాసన.

682.గానుగెద్దులాగా

683.గుండ్లు తేలి బెండ్లు మునిగినట్లు.

684.గుడ గుడ శబ్దం కుండకు నష్టం.

685.గుడ్డకు జాడింపు, కూరకు తాలింపు, కోడలికి సాధింపు లేకపోతే ఇంపులేదు.

686.గుడి మింగేవాడికి గుళ్ళో లింగమోలెఖ్ఖా.

687.గుళ్ళో దేవుడికి నైవేద్యం లేకున్నా పూజారి పులిహోర కేడ్చాట్ట.

688.గుడ్డెద్దు చేలో పడ్డట్టు.

690.గుడ్డి కన్నా మెల్ల మేలు.

691.గుడ్డికన్ను మూసినా ఒకటే, తెరిచినా ఒకటే.

692.గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించినట్లు.

693.గుమ్మడికాయల దొంగ అంటే భుజాలు తడుముకున్నట్లు.

694.గురిగింజ ముడ్డిక్రింద నలుపెరగదు.

695.గురువుకు మించిన శిష్యుడు.

696.గురువులేని విద్య గుడ్డి విద్య.

697.గువ్వ గూడెక్కె, అవ్వ మంచమెక్కె.

698.గూట్లో దీపం నోట్లో ముద్ద.

699.గొడ్డుకొక దెబ్బ, మనిషికొక మాట.

700.గొడ్రాలికేం తెలుసు బిడ్డనొప్పి.

701.గొడ్డొచ్చినవేళ బిడ్డొచ్చిన వేళ.

702.గొర్రెకు బెత్తెడే తోక.

703.గొర్రెకసాయి వాణ్ణే నమ్ముతుంది.

704.గొల్లల గోత్రాలు గొర్రెల కెరుక, గొర్రెల గోత్రాలు గొల్లల కెరుక.

705.గొల్ల సుద్దులు, పిల్ల ముద్దులు.

706.గొళ్ళెంలేని తలుపు, కళ్లెం లేని గుర్రం.

707.గోచికి పెద్ద, అంగవస్త్రానికి చిన్న.

708.గోరుచుట్టుపై రోకటి పోటు.

709.గోరంత దీపం కొండంత వెలుగు.

710.గోరింతలు కొండంతలు చేసినట్లు.

711.గోవులను కోసి చెప్పులను దానం చేసినట్లు.

712.గొంగట్లో అన్నం తింటూ వెంట్రుక లేరుకున్నట్లు

713.గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్లు.

714.గోకుడుకు గీకుడే మందు.

715.గోచిపాతరాయుడు దొంగలకు మిండడు.

716.గోచి పాతకు మించిన దరిద్రం లేదు.

717.గోడ మీది పిల్లి వాటు.

718.గ్రాసం లేని కొలువు. రసం లేని కావ్యం.

719.గోవులేని ఊళ్ళో గొడ్డు గేదే శ్రీమహాలక్ష్మి.

720.గ్రాసంలేని బంటుకు రోషం ఎక్కువ.

## ఘ ఘా

721.ఘంటాకర్ణుడికి అష్టాక్షరి ఉపదేశం చేయబోయినట్లు.

721.ఘడియ తీరుబాటు లేదు, దమ్మిడీ ఆదాయం లేదు.

722.ఘడియకు హోజీ, ఘడియకు ఫాజీ

723. ఘోటక బ్రహ్మచారి.

## “చ” “ఛ” లు

725. చంక ఎక్కిన పిల్ల చచ్చినా దిగదు.

726. చంకలో పిల్ల నుంచుకొని నంతంతా వెతికి నట్లు.

727. చంకన పిల్ల కడుపులో పిల్ల.

728. చంద్రుణ్ణి చూచి కుక్కలు మొరిగినట్లు.

729. చంద్రుడికో నూలు పోగు.

730. చక్కగా కూర్చోరా చాకలి నాయుడా, అంటేవిన్నా వటోయ్ ఈడగ నాయుడా మంగలి నాయుడి సరసమన్నాట్ట.

731. చచ్చిన వాడు ఏడ్చినా రాడు.

732. చక్కదనాలకు కొట్టి పిట్ట, సంగీతానికి గాడిద

733. చచ్చేవాడి పెళ్ళికి వచ్చినంత కట్నం.

734. చచ్చేటప్పుడు సంధి మంత్రం.

735. చచ్చేటప్పుడు శంభో శంకరా అంటే.

736. చదవేస్తే ఉన్నమతి పోయినట్లు.

737. చక్కనమ్మ చిక్కినా అందమే.

738. చదవేస్తే ఉన్నమతి పోయింది.

739. చక్రవర్తి చేస్తే శృంగారం,అదే చాకలి చేస్తే వ్యభిచారం.

740. చచ్చిం తర్వాత తెలుస్తుంది శెట్టి బండారం.

741. చచ్చిం తర్వాత తెలుస్తుంది శెట్టి చేసిన ధర్మం.

742. చచ్చిన వాడి కండ్లు పత్తి కాయలంత.

743. చచ్చేదాకా బ్రతికితే పెళ్ళి చేస్తానన్నాట్ట.

744. చదవక ముందు కాకర కాయ, చదివిన తర్వాత కీకర కాయ.

745.చదివేది రామాయణం, పడగొట్టేది దేవాలయం.

746.చచ్చేటప్పుడు సంధ్య మంత్రమా?

747.చచ్చే కాలానికి సత్యభామ వేషం వేసినట్లు.

748.చదువురాని మొద్దు, కదల లేని ఎద్దు.

749.చద్ది కూడు తిన్నమ్మ మొగుడి ఆకలి ఎరుగదు.

750.చన్ను కుడిచి రొమ్ము గుద్దినట్లు.

751.చల్లకుండకు, చంటి బిడ్డకు చాటుండాలి.

752.చల్లకొచ్చి ముంత దాచట మెందుకు

753.చవి ఎరిగిన కుక్క చావ గొట్టినా పోదు.

754.చద్దామని చద్ది అన్నం తింటే చల్లగా నిద్ర వచ్చిందట.

755.చాకలి అత్త, మంగలి మామ, కొడుకు సాలెవాడైతేనేం, సాతానోడైతేనేం.

756.చాకలిది సందెరుగదు, మాలది మంచమెరుగదు.

757.చాకలి, మంగలి పొత్తు ఇంటికి రాదు విత్తు.

758.చాదస్తం మొగుడు చెపితే వినడు, చెప్పకుంటే కరుస్తాడు.

759.చావుకన్నా గండంలేదు, గోచిపాత కన్నా దరిద్రం లేదు.

760.చావు కబురు చల్లగా చెప్పాడు.

761.చావుకు పెడితే గాని లంఖణాలకు రాదు.

762.చావు తప్పి కన్ను లొట్ట బోయినట్లు.

763.చదువూలేదు, సంధ్యాలేదు, సంతానం మాత్రం మెండు.

764.చనువు చేసిన ఆలు చంక నెక్కుతుంది.

765.చన్నీళ్ళకు వేణ్ణీళ్ళు తోడు.

766.చల్లా చేయి గొల్లాభామా, ముడ్డీ తిప్పూ ముసలిభామ.

767.చాకలి కొత్త, మంగలి పాత.

768. చాపెడు తిని చెడ్డాడు, వాకిలి దాటి పడ్డాడు.

769. చాలుపై చాలు దున్నితే చచ్చు చేనైనా పండుతుంది.

770. చచ్చే కాలానికి సమర్త కట్నాలు.

771. చావుదలకు లావు దుఃఖం

772. చిత్తం శివుని మీద, భక్తి చెప్పుల మీద.

773. చిన్న పామైనా పెద్ద కర్రతో కొట్టాలి.

774. చెట్టు చెడే కాలానికి కుక్కమూతి పిందెలు పుడతాయి.

775. చిన్నక్క చిలక, పెద్దక్క గిలక, చూస్తే చుక్క, రేగితే కుక్క.

776. చిన్న ఇల్లు కట్టుకున్నా పెద్ద కాపురం చెయ్యాలి.

777. చిలక ముక్కుకు దొండ పండు.

778. చిలుమొదిల్తే గాని చిద్ర మొదలదు

779. చిల్లర శ్రీ మహాలక్ష్మి.

780. చేసేవి శివ పూజలు దూరేవి దొమ్మరి గుడిసెలు.

781. చిల్లి కాదు, తూటు అన్నాట్ట.

782. చింత చచ్చినా పులుపు చావదు.

783. చిత్త కార్తెలో కుక్కల్లాగా.

784. చిత్త జల్లు, స్వాతి వాన

785. చిదంబర రహస్యం.

786. చిలికి చిలికి గాలి వాన అయినట్లు.

787. చిన్నవాడు తింటే చిరుతిండి, అదే పెద్ద వాళ్ళు తింటే ఫలహారం.

788. చీకటి కొన్నాళ్లు, వెన్నెల కొన్నాళ్ళు.

789. చీటికి ప్రాణం ప్రాలు.

790. చీమలు పెట్టిన పుట్టలు పాముల కిరవైనట్లు.
791. చూడ చుట్టము, మొక్క దైవము లేదు.
792. చెట్టై వంగనిది మ్రానై వంగుతుందా.
793. చెట్టు ముందా విత్తు ముందా అన్నట్లు.
794. చేసిన పాపం చెపితే పోతుంది.
795. చీర సింగారించేటప్పటికి పట్నం కొల్ల బోయిందట.
796. చూస్తే నీది, చూడకుంటే నాది.
797. చెడిపోయి చెన్నపట్నం చేరమన్నాట్ట.
798. చెడిపోయి స్నేహితుడింటికి వెళ్ళొచ్చు గాని చెల్లెలింటికి వెళ్ళకూడదు.
799. చెప్పుక్రింది తేలు లాగా.
800. చెప్పే వాడికి సిగ్గు లేకపోతే వినే వాడికైనా వివేకముండొద్దా.
801. చెరుకా బెల్లం పెట్టమంటే పెడుతుందా?
802. చెవిటి వాడి ముందు శంఖమూదినట్లు.
803. చెవుడు చెవుడంటే తవుడు తవుడన్నాట్ట.
804. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుంటే లాభమేమిటి?
805. చేనుకు గట్టు, ఊరికి కట్టు ఉండాలి.
806. చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ.
807. చూచిగాని తాగకూడదు, చదివి గాని సంతకం పెట్టగూడదు.
808. చూపితే మానం పోయె, చూపక పోతే ప్రాణం పోయె.
809. చెడిబ్రతికిన వాడి చెంపలు చూడు, బ్రతికి చెడిన వాడి బట్టలు చూడు.
810. చెప్పడం సులభం చేయడం కష్టం.
811. చెప్పడు మాటలు చేటు.

812. చెరువు నిండితే కప్పలు చేరతాయి.

813. చెరపకురా చెడేవు.

814. చెరువు మీద అలిగి ముడ్డి కడుక్కోకుండా పోయినట్లు.

815. చెలిమితో చేదు తినిపించవచ్చుగాని, బలిమితో పాలు తాగించలేము.

816. చెల్లని కాసుకు గీత లెక్కువ.

817. చెవి దగ్గర జోరీగలాగా.

818. చెవుల పిల్లి ఎదురైతే చేటు వస్తుంది.

819. చిత్తలో చల్లితే చిత్తుగా పండుతుంది.

820. చీకట్లో చిందులు తొక్కినట్లు.

821. చీర సింగారించేసరికి ఊరు మాటు మడుగుతుంది.

822. చుట్టం మీద తీపా బియ్యం మీద తీపా.

823. చుట్టమై చూడవస్తే దయ్యమై పట్టుకున్నాట్ట.

824. చూచి రమ్మంటే కాల్చి వచ్చినట్లు.

825. చెట్టు నాటిన వాడు నీళ్ళుపోయడా.

826. చెట్టును బట్టి కాయ.

827. చెట్టు పేరు చెప్పి కాయలమ్ము కున్నట్లు.

828. చెయ్యి దాచుకోగలంగాని కులం దాచుకోగలమా.

829. చెరువుకు చేరువగాను, చుట్టాలకు దూరంగాను ఉండాలి.

830. చేతగానమ్మకు శౌర్య మెక్కువ.

831. చేతగాని మొగుడు ఇంట్లో ఉన్న ఒకటే వీధిలో ఉన్నా ఒకటే.

832. చేతి చమురు భాగవతం.

833. చేతిలో ఉంటే అర్థం, చేరువలో ఉంటే పెళ్ళాం.

834.చేదోడు, వాదోడు.

835.చొప్ప వామిలో నిప్పు దాచుకున్నట్లు.

836.చోళ్ళు విసిరే తిరగలి జొన్నలు విసురుతుందా.

837.చెవి కోసిన మేక లాగా.

838.చేట భారతం కంబ రామాయణం.

839.చేటు కాలానికి చెడ్డ బుద్ధులు.

840.చేత కానమ్మకు చేష్టలు మెండు, చెల్లని రూకకు గీతలు మెండు.

841.చేసుకున్న కర్మ మోయ్ శంభులింగమా అంటే అనుభవించక తప్పదోయ్ అబ్బులింగమా అన్నాట్ట.

842.ఛీఛీ అనేదీ ఈ నోరే, శివ శివ అనేదీ ఈనోరే.

843.ఛీఛీ కుక్కా అంటే ఏమే అక్కా అందట.

844.జీతం, బత్తెం లేని ఉద్యోగం.

845.జగడ మెట్టా వస్తాది జంగం దేవరా అంటే బిచ్చం పెట్టవే బొచ్చు ముండా అన్నాట్ట.

846.జగమెరిగిన బ్రాహ్మడికి జందెమేల అన్నాట్ట.

847.జన వాక్యం జరగక తప్పదు.

848.జననినీ ధరణినీ నమ్మి చెడినవారు లేరు.

849.జన్మానికంతా శివరాత్రి అన్నట్లు.

850.జయ మున్నంత వరకూ భయం లేదు.

851.జరుగు బాటుంటే జ్వరమున్నంత సుఖంలేదు.

852.జరుగు బాటు తక్కువ. అదిరిపాటు ఎక్కువ.

853.జాతి కొద్దీ బుద్ధి, కులం కొద్దీ ఆచారం.

854.జిహ్వకో రుచి, పుర్రెకో బుద్ధి.

855.జీతగాడికి, నేతగాడికి చావులేదు.

856.జీలకర్ర, సింగి నాదం.

857.జుట్టున్నమ్మ ఎన్ని జడలైనా వేయవచ్చు.

858.జొన్న పెరిగితే జాడు, వరి పెరిగితే వడ్లు.

859.జోగి జోగి రాచుకుంటే బూడిద రాలిందట.

860.జంగానికి బిడ్డలు పుడితే ఊరందరికీ ఉపాధి.

861.జీవన్మృతులు, మృత జీవులు.

862.జయాప జయాలు దైవాధీనాలు.

863.జిల్లేళ్ళకు మల్లెలు పూసాయా.

864.జీలకర్రలో కర్రలేదు, నేతి బీరలో నెయ్యిలేదు.

865.జానెడు ఇంట్లో మూరెడు కర్ర.

866.జోడు లేని బ్రతుకు, తాడు లేని బొంగరం.

867.జరిగే వరకూ జయభేరి, జరక్కపోతే రణభేరి.

## ట ఠ డ ఢ ణ

868.టెంకాయ చెట్టు ఎందుకెక్కావురా అంటే దూడ గడ్డి కోసం అన్నట్టు.

869.టెంకాయ చెట్టుకు మడిగుడ్డ కట్టగానే అది దొంగ కడ్డమా.

870.టాటోటు గాడికి దధ్యన్నం, విశ్వాసపాత్రుడికి చద్ది అన్నం.

871.టంగుటూరి పెద్దమాలను తగవు తీర్చమంటే తనకు ఇద్ద రన్నారట.

872.డబ్బు పాపిష్టిది.

873.డబ్బు లేని వాడు డుబ్బుకు కొరగాడు.

874.డబ్బుకు, ప్రాణానికి లంకె.

875.డబ్బు సభ గట్టుకు ముద్ద నోటి గట్టుకు.
876.డబ్బు ఇవ్వని వాడు ముందుగా పడవెక్కాట్ట.
877.డబ్బుంటే చాలు కొండమీది కోతైనా దిగి వస్తుంది.
878.డబ్బు ముడ్డిలో దేవుడున్నాడు.
879.డబ్బురాని విద్య దరిద్రానికే.
880.డాబు సరి బావా అంటే డబ్బులేదు మరదలా అన్నాట్ట.
881.డూడూ బసవన్నా అంటే తలూపినట్లు.
882.డవులు దస్తు, పెళ్ళాం పస్తు.
883.ఢిల్లీకి ఢిల్లి పల్లెకు పల్లె.
884.డబ్బిచ్చి తేలు కుట్టించుకున్నట్లు.

## త ద న

885.తంగేడు పూచినట్లు.
886.తంగేటి జున్నును దాచడమెందుకు.
887.తడిగుడ్డతో గొంతులు కోస్తారు.
888.తడిసి గాని గుడిసె కట్టడు, తాకిగాని మొగ్గడు.
889.తడిసి ముప్పందుము మోసినట్లు.
890.తద్దినం కొని తెచ్చుకున్నట్లు.
891.తనకు కానిది కూసు ముండ.
982.తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం.
893.తక్కువ నోములు నోచి ఎక్కువ ఫలం రమ్మంటే వస్తుందా.
894.తండ్రి సేద్యం, కొడుకు వైద్యం, కూడు మధ్యం.
895.తంబళ్ళ అనుమానం తలతిక్క.
896.తగు దాసరికి, మెడ పూసలకు, అమ్మగన్న సంతానానికి,

అయ్య ఇచ్చిన మనువుకు సమ్మ సరిపోయింది.

897.తలుపులేని ఇంట కుక్కలు దూరవా.

898.తన దాకా వస్తే కాని తలనెప్పి బాధ తెలియదు.

899.తన దీపమని ముద్దుపెట్టుకుంటే తన మీసాలు కాలకుండా ఉంటాయా.

900.తన పిల్ల తమిటి కేడిస్తే లంజపిల్ల రాగి రేకుకు ఏడ్చిందట.

901.తన బంగారం మంచిదైతే కంసాలి ఏం చేస్తాడు.

902.తనకు లేదని ఏడిస్తే ఒక కన్ను పోయింది. ఎదుటి వాడి కున్నదని ఏడిస్తే ఇంకోకన్ను పోయింది.

903.తద్దినానికి తక్కువ, మాసికానికెక్కువ.

904.తద్దినం పెట్టేవాడి తమ్ముడి లాగా.

905.తద్దినానికి భోజనానికి పిలిస్తే రోజూ మీ ఇంట్లో ఇట్లాగే జరగాలని దీవించాడట.

906.తన కంపు తన కింపు, ఒకరి కంపు ఓకరింపు.

907.తమ్ముడు తనవాడైనా ధర్మం చెప్పాలి.

908.తలక్రింద కొరివి.

909.తల ప్రాణం తోక కొచ్చినట్లు.

910.తన బలిమికన్నా స్థాన బలం మేలు.

911.తన ముడ్డికాకపోతే కాశీదాకా దేకమన్నాట్ట.

912.తలంత బలగమున్నా తలకొరివి పెట్టేవాడు లేడు.

913.తలలు బోడులైతే తలుపులు బోడులవుతాయా

914.తనయుడి పుటక తల్లికి తెలుసు.

915.తల్లి కడుపు చూస్తుంది, భార్య వీపు చూస్తుంది.

916.తల్లిని చూచి పిల్లను, పాలను చూచి బర్రెను కొనాలి.

917.తల్లిని నమ్మిన వాడు, ధరణిని నమ్మిన వాడు చెడిపోడు.

918.తల్లి పుట్టిల్లు మేనమామ ఎరగడా.

919.తల్లి లేని పిల్ల, ఉల్లిలేని కూర.

920.తల్లి బంగారమైనా కంసాలి దొంగిలిస్తాడు.

921.తలా, తోక లేని కథ, ముక్కు, మొహము లేని పిల్ల.

922.తాజెడ్డ కోతి వనమెల్లా చెరిచిందట.

923.తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదురుతాయా?

924.తాటి చెట్లలో పొద్దుకూకినట్లు.

925.తాతకు దగ్గులు నేర్పినట్లు.

926.తాడెక్కే వాడికి తలదన్నే వాడుంటాడు.

927.తాతాచార్ల ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు.

928.తాను తిన తవుడు లేదు, వారాంగనకు వడియాలు కావా లన్నాట్ట.

929.తానుపట్టిన కుందేటికి మూడేకాళ్ళు.

930.తాదూర కంతలేదు, మెడకోడాలు అన్నాట్ట.

931.తన కోపమె తన శత్రువు, తన శాంతమె తనకు రక్ష.

932.తన పుట్టిల్లే తనకు కైలాసం.

933.తనను కట్ట తాళ్ళు తానే తెచ్చుకున్నట్లు.

934.తన పెరటి చెట్టు మందుకు పనికి రానట్లు.

935.తన సొమ్ము అల్లం, పెరవారి సొమ్ము బెల్లం.

936.తన సొమ్ము సోమవారం, మంది సొమ్ము మంగళవారం.

937.తప్పు చేసిన వాడికి అప్పు చేసిన వాడికి ముఖం చెల్లదు.

938.తప్పు లెన్ను వారు తండోప తండాలు.

939.తప్పు లెన్నే వారు తమ తప్పెరుగరు.

940. తప్పెట కొట్టేవాడు దాసరి, శంఖమూదేవాడు జంగం.

941. తలకు మించిన శిక్ష, గోచికి మించిన దరిద్రం లేదు.

942. తలచి నప్పుడే తాతకు పెళ్ళి.

943. తలకోసి మొలవేసినట్లు.

944. తలంబ్రాలకు, తద్దినానికి ఒకే మంత్రమా.

945. తలరాత ఎవరూ తప్పించ లేరు.

946. తలలో నాలుక, పూసల్లో దారం.

947. తలవెంట్రుకలంత బలగ మున్నా తలకొరివి పెట్టేవాడు లేడు.

948. తల్లికి కూడు పెట్టని వాడు తగుదునమ్మా అని తగువు తీర్చడానికి వచ్చాట్ట.

949. తల్లి చస్తే తరం బాసే, తండ్రి చస్తే ఋణం బాసె.

950. తల్లి తర్పణానికే తక్కువైతే పినతల్లికి పెట్టరా పిండ ప్రదానం అన్నాట్ట.

951. తల్లిని బట్టి పిల్ల, విత్తును బట్టి పంట.

952. తల్లి విషం, పెళ్ళాం బెల్లం.

953. తగిలిన వేలికే మళ్ళీ తగులు తుంది.

954. తాగబోతే మజ్జిగలేదంటే పెరుగుకోసం చీటీ రాయమన్నాట్ట.

955. తాగితే గాని మొగ్గదు, తడిస్తే గాని కప్పదు.

956. తాగిన వాడు, తప్పిన వాడు ఒకటే.

957. తాగిన వాడిదే పాటు, సాగిన వాడిదే ఆట.

958. తాటి చెట్టుక్రింద పాలుతాగినా కల్లే అంటారు.

959. తాటి చెట్టు నీడ నీడాకాదు, తగులుకున్న ముండ పెళ్ళామూ కాదు.

960. తాటి చెట్టుకు గంధం పూసినట్లు.

961.తాడు తెంచడానికి ముహూర్తం పెట్టినట్లు.

962.తాడూ లేదు, బొంగరం లేదు.

963.తాతల నాడు నేతులు తాగాం, మా మూతుల వాసన చూడమన్నాట్ట.

964.తాతా తాతా పెళ్ళాడతావా అంటే నాకెవడిస్తాడురా అబ్బాయి అన్నాట్ట.

965.తాను తవ్వుకున్న గోతిలో తానే పడ్డట్టు.

966.తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు.

967.తామరాకుపై నీటి బొట్టులాగా.

968.తాలుగింజ లోయి దాసరి అంటే రాలిన వరకే గోవిందా అన్నాట్ట.

969.తాళం నీ దగ్గర, చెవి నా దగ్గర.

970.తాళి బొట్టు బలంవల్ల తలంబ్రాల వరకూ బ్రతికాట్ట.

971.తాళ్ళపాక వారి కవిత్వం కొంత, తన పైత్యం కొంత.

972.తానే తుమ్మి తానే శతాయుష్షు అనుకున్నట్లు.

973.తావలచింది రంభ, తా మునిగింది గంగ.

974.తింటేగాని రుచి తెలియదు, దిగితేగాని లోతు తెలియదు.

975.తిండికి తిమ్మరాజు, పనికి పోతురాజు.

976.తిన మరిగిన కోడి ఇల్లెక్కి కూసిందట.

977.తింటే ఆయాసం, తినకుంటే నీరసం.

978.తింటే మీగడ తినాలి, వింటే బేగడ (రాగం) వినాలి.

979.తిండికి తికాణాలేదు, ముండకు బులాకీ కావాలి అన్నాట్ట.

980.తిండికి వచ్చినట్లా, తీర్థానికి వచ్చినట్లా.

981. తిండిలేనమ్మ తిరుణాళ్లకు పోతే ఎక్కనూ దిగనూ సరిపోయిందట.

982. తిడితే చచ్చిన వాడూ లేడు, దీవిస్తే బ్రతికిన వాడూ లేడు.

983. తిడితే గాలికిపోతాయి, తింటే లోనికి పోతాయి.

984. తినగా తినగా వేము తీయగా ఉంటుందట.

985. తినబోతూ రుచి అడిగినట్లు.

986. తినగా తినగా గారెలు చేదట.

987. తినేది గొడ్డు మాంసం, చేసేది దేవతార్చన.

988. తిన్న ఇంటి వాసాలు లెక్క పెట్టినట్లు.

989. తిమ్మన్నా, తిమ్మన్నా నమస్కారమంటే నాపేరు నీకెల తెలిసిందంటే నీముఖం చూడగానే తెలిసింది అన్నాట్ట.

990. తిరిగి ఆడది, తిరక్క మగాడు చెడ్డాట్ట.

991. తిరిగేకాలు, తిట్టేనోరు ఊరుకోదు.

992. తిరిపెం పెట్టే అమ్మను నీమొగుడితోపాటు పెట్టమన్నట్లు.

993. తిరుపతికి పోగానే తురక దాసరికాదు.

994. తిలాపాపం తలాపిడికెడు

995. తిమ్మన్న బంతికి రమ్మంటారు కాబోలు.

996. తిమ్మిని బెమ్మిని, బెమ్మిని తిమ్మిని చేసేవాడు.

997. తీయగా తీయగా రాగం, మూల్గగా, మూల్గగా రోగం.

998. తీగ కదిలిస్తే డొంకంతా కదిలినట్లు.

999. తనది తాటాకు, ఇవతలి వాడిది ఈటాకు.

1000. తప్పతాగి కులం మరిచినట్లు.

1001. తినేవరకూ తింటికుట్టు, తిన్న తర్వాత దండికుట్టు.

1002. తీతువు పిట్ట రాయబారం.

1003. తీర్థం, స్వార్థం కలిసొచ్చినట్లు.

1004. తిరపతి మంగలి వాడి క్షవరం.

1005. తుంటిమీద కొడితే మూతి పళ్ళురాలాయట.

1006. తుమ్మితే ఊడిపోయే ముక్కు.

1007. తుమ్ముకు తమ్ముడు ఆవలింతకు అన్న.

1008. తులసి వనంలో గంజాయి మొక్కలాగా.

1009. తూగి ముందుకు పడకు, తాగి వెనకకు పడకు.

1010. తూట్లు మూసి తూములు తెరచినట్లు.

1011. తూనీగ లాడిడే తూమెడు వర్షం.

1012. తూర్పున వరద గూడు వేస్తే తుంగపోచైనా తడవదు.

1013. తెగించిన వాడికి తెడ్డే లింగం.

1014. తెగిన గాలిపటం లాగా.

1015. తెగేదాకా బిగించకూడదు.

1016. తెచ్చుకుంటే భోంచేయి జగన్నాయకా, లేకుంటే ఊరకుండు జగన్నాయక.

1017. తెడ్డుకేం తెలుస్తుంది కూర రుచి

1018. తెలివి ఒకరి సొమ్మా తొండవు సుబ్బమ్మా.

1019. తొండముదిరి ఊసరవెల్లి అయినట్లు.

1020. తొందరగా రమ్మంటే తిరగమోత వేసి వస్తానన్నదట.

1021. తొడబలముంటే తొంభైమంది.

1022. తొత్తు క్రింద బడి తొత్తు.

1023. తొలి పెళ్లాం తోటకూర, మలిపెళ్ళాం మామిపండు, మూడ

వవెల్లాం ముంతమామిడి పప్పు.

1024.తోక తెగిన నక్కలాగా.

1025.తోక తొక్కిన తాచులాగా.

1026.తోక వెంబడి నారాయణా అన్నట్లు.

1027.తోచీ తోచనమ్మ తోటికోడలి పుట్టింటికెళితే, అదీ తోచనమ్మ ఆడబిడ్డ అత్తగారింటి కెళ్లిందట.

1028.తోడు లేక పోందే రాచ పీనుగ.

1029.తోరణం లేని పెళ్ళి, వీరణం లేని బాజాలు.

1030.త్రోవన పొయ్యే వాడొకడు, దొబ్బులు తినే వాడొకడు.

1031.తొక్కలేనమ్మ తొక్కులో నీళ్ళు పోసిందట.

1032.తొలకరి చెరువు నిండినా, తొలి చూలుకు కొడుకు పుట్టినా లాభం.

1033.తొత్తులాగా పాటుపడి, దొరలాగా తినాలి.

1034.తాగడానికి ముందు, వ్రాతకు వెనుక ఉండాలి.

1035.తీగెకు కాయ బరువవుతుందా.

1036.దొందూ దొందే.

1037.దండమయ్యా బాపనయ్యా అంటే నీ తండ్రి నాటి పాత బాకీ ఇచ్చి పొమ్మన్నాట్ట.

1038.దింపుడు కళ్ళమాశ.

1039.దారిన పొయ్యే దానయ్య.

1040.దాసి కొడుకైనా కాసులు కలవాడే రాజు.

1041.దివిటీ క్రింద దీపం.

1042.దిశమొల వాడి దగ్గరకు దిగంబరుడు వచ్చి బట్ట అడిగాట్ట.

1043.దిక్కు మొక్కు లేని దివాణం.

1044.దీపముండగానే ఇల్లు చక్కపెట్టుకోవాలి.

1045.దీపావళి వర్షాలు ద్వీపాంతరం దాటుతాయి.

1046.దున్నకుండా వేసిన ఆముదాలు, మాదిగవాడికి ఇచ్చిన అప్పు తిరిగిరాదు.

1047.దున్నపోతుపై వాన కురిసినట్లు.

1048.దున్నపోతు ఈనిందంటే దూడను కట్టేయమన్నట్లు.

1049.దురాశ దుఃఖం చేటు.

1050.దుష్టుడికి దూరంగా ఉండాలి.

1051.దూడ కుడిచినట్లా, దుత్తలో పడ్డట్టా.

1052.దూరపు కొండలు నునుపు.

1053.దూడలేని పాడి దుఃఖపు పాడి.

1054.దెబ్బకు దయ్యం పారిపోయినట్లు.

1055.దేవుడి పెళ్ళికి అందరూ పెద్దలే.

1056.దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడు.

1057.దొంగల సొమ్ము దొరలపాలు.

1058.దొంగకు తేలుకుట్టినట్లు.

1059.దాసరి తప్పు దండంతో సరి.

1060.దిక్కులేని వాడికి దేవుడే దిక్కు.

1061.ధీరుడైనా కావాలి, దీనుడైనా కావాలి.

1062.ధూపం వేస్తే పాపం పోతుందట.

1063.నందంటే నంది, పందంటే పంది.

1064.నంబి పెట్టిందే ప్రసాదం.

1065. నంది, తంబళి, నాగుబాము, చెవులపిల్లి ఎదురుపడితే చేటు వస్తుంది.

1066. తురక, మరక తిరగేసి నరక.

1067. 'తూ' శాదొడ్డుంబాల్.

1068. తెలగాణ్యకు టెక్కు, నియోగికి నిక్కు.

1069. తెలివి తక్కువ, ఆకలెక్కువ.

1070. తెలిసేవరకూ బ్రహ్మ విద్య, తెలిసింతర్వాత కూసువిద్య.

1071. తెల్లనివన్నీ పాలా? నల్లనివన్నీ నీళ్ళా?

1072. తేనెలో పడ్డ ఈగలాగా.

1073. తేరగా వచ్చింది ఊరికే పోతుంది.

1074. తేలే నమ్మకు తీపులు మెండు.

1075. తోక ముడుచుకున్నట్లు.

1076. దండుకు పోయిన వాడి పెళ్ళాం ఏనాటికైనా ముండమోపే.

1077. దగ్గరకు పిలిచి దాసరీ అంటే నీ కన్నులొట్ట అన్నట్టు.

1078. దగ్గు, సిగ్గు దాచినా దాగవు.

1079. దప్పిగొన్నప్పుడు బావి తవ్వినట్లు.

1080. దమ్మిడీ ఆదాలేదు, క్షణం తీరికలేదు.

1081. దమ్మిడీ పెళ్ళికి ఏగాణి భోగం మేళం.

1082. దమ్మిడీ ముండకు ఏగాణి క్షవరం.

1083. దయ్యాల ముందర బిడ్డలు బ్రతుకుతారా.

1084. దరిద్రుడికి పిల్లలెక్కువ.

1085. దరిద్రానికి ఆకలెక్కువ.

1086. దరిద్రానికి మాటలెక్కువ, తద్దినానికి కూరలెక్కువ.

1087. దరిలేని బావి, దాపులేని కొంప.

1088. దశకొద్దీ పురుషుడు, దానంకొద్దీ బిడ్డలు.

1089. దశకొద్దీ దొరికాడు దిశమొల మొగుడు.

1090. దాతలేని ఊరు దయ్యాలపేట.

1091. దాయాది ఉంటే నిప్పెందుకు.

1092. దారినపోయే తద్దినమా మా ఇంటికిరా అన్నట్లు.

1093. దారినపోయే శనేశ్వరాన్ని కొనుక్కొని తెచ్చుకున్నట్లు

1094. దినదిన గండం, నూరేళ్ళాయుష్షు.

1095. దూడ కుడిచినట్టూ, దుత్తలో పడ్డట్టూ.

1096. దేవుడని మొక్కితే దయ్యమై పట్టుకున్నట్టు.

1097. దేవుడి పెళ్ళికి అందరూ పెద్దలే.

1098. దొంగలు దోచిన కొంప.

1099. దొంగచేతికి తాళాలిచ్చినట్లు.

1100. దొంగలు పడ్డ ఆరునెలలకు కుక్కలు మొరిగినట్లు.

1101. దొంగలు, దొంగలు కలిసి ఊళ్ళు పంచుకున్నట్లు.

1102. దొడ్డినిండా గొడ్లు, ఇంటినిండా బిడ్డలు, ఇంకే కావాలి ఇర కాటానికి.

1103. దొరికితే దొంగ, దొరక్కపోతే దొర.

1104. దోసకాయలు తిన్న కడుపు, దొంగలు పడ్డ ఇల్లు ఒకటే.

1105. దౌర్భాగ్య దామోదరుడు.

1106. ధర్మానికి దండగలేదు, వెట్టికి పైసాలేదు.

1107. ధర్మానికిపోతే కర్మం చుట్టుకున్నట్టు.

1108. తాకట్లు మొగుడా, తంటాల మొగుడా నీ తనువుండగానే

నన్ను మనువిచ్చిపోరా.

1109.దండగలో పండగ వచ్చిందట.

1110.దంపి నమ్మకు బొక్కిందే కూడు.

1111.దారిలో దొరికింది ధర్మానికి పోయింది.

1112.దాసరి పాట్లు దైవాని కెరుక.

1113.దీపావళికి దీపమంత చలి.

1114.దున్ననివాడికి గడ్డ ఎందుకు, ఏలనివాడికి పెళ్ళామెందుకు.

1115.దురాశ దుఃఖం చేటు, దుష్టుణ్ణి చూచి దూరంగా తొలగాలి

1116.దేశ భాషలందు తెలుగులెస్స.

1117.దేవుడికి ముడుపు, దయ్యానికి మంత్రం.

1118.నడవలేనమ్మకు నాలుగు పక్కలా సవారి.

1120.నడమంత్రపు సిరి నరాలమీది కురుపు.

1121.నరంలేని నాలుక నాలుగు విధాలు.

1122.నలుగురితో పాటు నారాయణా, కులంతో పాటు గోవిందా.

1123.నల్లేరు మీద బండిపోయినట్లు.

1124.నయాన, భయాన

1125.తమలపాకు కట్ట, పొగాకు మట్ట, హరిదాసు పొట్ట ఎప్పుడూ తడుపుతూ వుండాలి.

1126.నమిలే వాడికన్నా మింగేవాడే ఘనుడు.

1127.నవ్విన నాపచేనే పండుతుంది.

1128.నవ్వు నాలుగు విధాల చేటు.

1129.నవ్వే ఆడదాన్ని, ఏడ్చే మొగాణ్ణి నమ్మరాదు.

1130.నాకు సిగ్గులేదు, నీకు ఎగ్గులేదు.

1131.నాగవల్లి నిష్ఠూరం.

1132.నాచేతి మాత్ర వైకుంఠయాత్ర.

1133.నానాటికీ తీసికట్టు నాగంబొట్లు.

1134.నా ఇంటికి నేనే పెద్ద, పిల్లికి పెట్టరా పంగనామాలు.

1135.నారు పోసినవాడు నీరుపోయడా.

1136.నిండుకుండ తొణకదు.

1137.నిజమాడితే నిష్ఠూరం.

1138.నిప్పుకు చెదలంటుతుందా.

1139.నిప్పుతో చెలగాటం.

1140.నిమ్మకు నీరెత్తినట్లు.

1141.నివురు గప్పిన నిప్పు.

1142.నీతిలేనివాడు కోతికంటే పాడు.

1143.నీ నోసటనే పొద్దు పొడిచిందా.

1144.నీ ఎడమ చెయ్యితియ్యి. నా పుర్రచెయ్యి పెడతానన్నాడట.

1145.నీరు పల్లమెరుగు, నిజం దేవుడెరుగు.

1146.నీళ్ళు నీళ్ళ వంకను పారుతాయిగాని మిట్టలెక్కి పారతాయా.

1147.నిజం నిలకడ మీద తెలుస్తుంది.

1148.నీటిపై రాసిన మాట.

1149.నూటికి పెట్టి కోటికి గొరిగించేవాడు.

1150.నూరు కల్లలాడైనా ఒక ఇల్లు నిలపాలి.

1151.నూరు అబద్దాలాడినా ఒక పెళ్ళి చేయాలి.

1152.నూరు నోములు నోచి ఒక రంకు పోయిందట.

1153. నెల తక్కువైనా రాజింట పుట్టమన్నట్లు.

1154. నెలబాలుడికి నూలుపోగు.

1155. నేతి బీరకాయలాగా.

1156. నేల విడిచి సాము చేసినట్లు.

1157. నోటికీ, చేతికీ అడ్డులేదు.

1158. నోటిముత్యాలు రాలిపోతాయా.

1159. నోట్లో నువ్వుగింజ దాగదు.

1160. నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది.

1161. నోరు మాట్లాడుతుంటే నొసలు ఎక్కిరిస్తుంది.

1162. నిరక్షర కుక్షి, విరూపాక్ష దీక్షితుల వారికి ఇరవై ఒక్క భక్ష్యం ఒక్క లక్ష్యమా అన్నట్లు

1163. నేడు చస్తే రేపటికి రెండు.

1164. నందిని చెయ్యబోయి పందిని చేసినట్లు.

1165. నక్క ఎక్కడ, నాగలోకమెక్కడ.

1166. నక్క జిత్తులన్నీ నాదగ్గరుండగా తప్పించుకు పోయెరా తాబేటి బుర్ర అన్నట్లు.

1167. నక్కను తొక్కి వచ్చినవాడు.

1168. నక్క జిత్తులు నారాయణుడెరుగు.

1169. నగుబాట్ల పెళ్ళికి నాడే నాగవల్లి.

1170. నట్టేట్లో వడ్డసొమ్ము నట్టింటికి వచ్చినట్లు.

1171. నలుగురు నడిచే దారిలో గడ్డిపోచైనా మొలవదు.

1172. నన్ను కొడితే కొట్టావుగాని మా బావను కొట్టు చూద్దాం అన్నాట్ట.

1173. నన్ను ముట్టుకోకు నామాలకాకి.

1174. నపుంసకుడికి రంభ దొరికినట్లు.

1175. నమ్మితే ఇమ్ము, నమ్మకుంటే అమ్ము.

1176. నరాలమీది పుండు, నడమంత్రపు సిరి మాలావుతీపు.

1177. నలభీమపాకం.

1178. నల్లనివన్నీ నీళ్ళుకాదు, తెల్లనివన్నీ పాలుకాదు.

1179. నల్లబాపడు నాభి కంటే విషం.

1180. నలుగురితో చావు పెళ్ళితో సమానం.

1181. నలుగురు నడిచేదే బాట, పలుగురు పలికేదేమాట.

1182. నలుపు నాలుగు వంకలను తెస్తుంది. ఎరుపు ఏడు వంక
లను దాస్తుంది.

1183. నాకోడి, కుంపట్ లేకపోతే ఎట్లా తెల్లారుతుందో చూస్తాన
న్నదట.

1184. నా చెవులూ కంసాలే కుట్టాడు.

1185. నాడు కుట్టాలేదు, నేడు చించాలేదు.

1186. నాథుడు లేని రాజ్యం నానాదారులు.

1187. నాదముంటే గంట, వాదముంటే తంటా.

1188. నామం పెడితే కామం తగ్గుతుందా.

1189. నాయనమ్మ ఏంచేస్తూంది అంటే ఒలకబోసి ఎత్తుకుంటోంద
న్నట్లు.

1190. నిండా మునిగిన వాడికి చలేమిటి.

1191. నిండిన కడుపుకు అన్నం, బట్టతలకు నూనె.

1192. నిత్య కల్యాణం పచ్చతోరణం.

1193. నిత్యం చచ్చేవాడికి ఏడ్చేవాడెవడు.

1194. నిద్ర సుఖమెరుగదు, ఆకలి రుచెరుగదు.

1195. నిప్పుతొక్కిన కోతిలాగా.

1196. నిప్పురాజినా మొగం రాజినా మండకమానదు.

1197. నిప్పులో ఉప్పులాగా.

1198. నిలువ నీడలేదు పట్టు కొమ్మాలేదు.

1199. నీకు రానిది, నేను విననిది, లోకంలో లేనిదీ చెప్పమన్నట్లు.

1200. నీకు, నాకు కాదంటే రోలెక్కి తలంబ్రాలు పోయమన్నట్లు.

1201. నీటికి నాచు తెగులు, మాటకు మాట తెగులు.

1202. నీళ్ళున్నచోటనే బురద.

1203. నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష.

1204. నూకలిస్తే మేకలు కాస్తానన్నాట్ట.

1205. నూటికి ఒక్కటి చెల్లుమాట.

1206. నూరు కాకుల్లో ఒక కోకిలేం చేస్తుంది.

1207. నూరు గొడ్లు తిన్న రాబందుకు ఒకటే గాలిపెట్టు.

1208. నెమలిని చూచి నక్క నాట్యమాడినట్లు.

1209. నెయ్యానికైనా కయ్యానికైనా సమానత్వం ఉండాలి.

1210. నెలకు మూడు వానలు నిండారువంటలు.

1211. నేను పుట్టకపోతే నీకు పెళ్ళామే లేకపోవును అంటే నీవు పుట్టకపోతే నీ తల్లినే పెళ్ళాడి ఉందును అన్నాట్ట.

1212. నేను మందు తింటా, నీవు పత్యం ఉండు అన్నట్టు.

1213. నేనూ ఒక్కపొద్దే, నా మొగుడ్నూ ఒక్క పొద్దే పిండీ బియ్యమూ లేక పిల్లలూ ఒక్కపొద్దే.

1214. నేర్చి బ్రతికినవాడు, నేర్వక చెడ్డవాడూ లేడు.

1215. నత్త నడక.

1216. నోరా వీపుకు దెబ్బలు తేకే అన్నాట్ట.

1217. నోరుగల వాడిదే రాజ్యం.

1218. నేరేళ్ళు పండితే నేలలు పండుతాయి.

1219. నట్టేట పుట్టి మునిగినట్లు.

1220. నిప్పు ముట్టనిదే చెయ్యికాలదు.

1221. నూరుమంది గుడ్డివాళ్ళు పోగై ఒకపాడు నూతిలో పడ్డట్టు.

1222. నెమలికంట నీరు కారితే వేటగాడికి ముద్దా అన్నట్లు.

1223. నూరు మాటలైనా ఒక వ్రాతకు ఈడుకావు.

1224. నీతిలేనివాడు కోతికంటె పాడు.

1225. నీ నొసటనే పొద్దు పొడిచిందా.

1226. నీవు కాకపోతే నీ అబ్బ మరొకడు.

1227. నూటికి పెట్టి కోటికి గొరిగించేవాడు.

1228. నొసటన వ్రాసిన వ్రాలుకన్న గలదా మారేళ్ళు చింతించినన్.

## ప ఫ బ భ మ య ర ల వ

1224. పంచపాండవులు అంటే మంచపు కోళ్ళలాగా ముగ్గురు కారని
రెండంటూ ఒకటి చూపబోయి నున్నా చుట్టాట్ట.

1225. పంచాంగాలు పోతే నక్షత్రాలు పోతాయా.

1226. పంచాగ్ని మధ్య మందున్నట్లు.

1227. పంచె కేడరా పత్తి ధర.

1228. పంటకు వెంట, వంటకు మంట.

1229.పండని ఏడు పాటు ఎక్కువ.

1230.పండని నేల పదుల కంటే పండే నేల కొంచెం చాలు.

1231.పండ్ల చెట్టు క్రింద ముళ్ళ కంప ఉన్నట్లు.

1232. పండిత పుత్రః పరమ శుంఠః

1233.పండినా ఎండినా పన్ను తప్పదు.

1234.పండగ నాడు కూడా పాత మొగుడేనా.

1235.పండుటాకును చూసి పసరాకు నవ్వినట్లు.

1236.పందికేం తెలుసురా పన్నీరు వాసన.

1237.పందిని పొడిచినవాడే బంటు, కందం చెప్పిన వాడే కవి.

1238.పందిరి ఇల్లూ కాదు, పరదేశి మొగుడూ కాదు.

1239.పందుం తిన్నా పరగడుపే, ఏదుం తిన్నా ఏకాదశే.

1240.పక పక నవ్వేవాడు, గబగబ అరచేవాడు కపటమెరుగడు.

1241.పక్క ఇంట పోరంటే, పండగంత వేడుక

1242.పగడం లేని ఇల్లు, జగడం లేని ఇల్లు ఉండవు.

1243.పగలు చూస్తే రాత్రి కల్లోకి వస్తుందన్నట్లు.

1244.పగటి నిద్ర పనికి చేటు, మాపు జాగరణ పెయ్యికి చేటు.

1245.పగలెల్లా బారెడు నేశాను దివ్వె తేవె దిగవేస్తాను అన్నట్లు.

1246.పగవాణ్ణి పంచాగం అడిగితే మధ్యాహ్నానికి మరణమన్నాట్ట.

1247.పగటిమాటలు పనికిచేటు, రాత్రి మాటలు నిద్రకుచేటు.

1248.పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది.

1249.పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టు.

1250.పట్టి పట్టి పంగనామాలు దిద్దితే గోడచాటుకెళ్ళి గోకివేశాడట.

1251.పట్టిందల్లా బంగారం, ముట్టిందల్లా ముత్యం.

1252.పడిశం పది రోగాల పెట్టు.

1253.పడుచుల కాపురం చితుకుల మంట.

1254.పదిమందితో చావు పెళ్ళితో సమానం.

1255.పనిలేని మంగలి పిల్లితల గొరిగినట్లు.

1256.పప్పులేని పెళ్ళి ఉప్పులేని కూర.

1257.పరుగెత్తి పాలు తాగేకన్నా నిల్చొని నీళ్ళు తాగడం మేలు.

1258.పదుగురాడు మాట పాటియై ధర చెల్లు.

1259.పచ్చని వరహాకంటే పుచ్చిన గింజ మేలు.

1260.పట్టపగలు కన్నమేస్తావేమిరా అంటే నా కడుపు కక్కుర్తి నీకేం తెలుసు అన్నాట్ట.

1261.పట్టి విడిచిన మండ, మబ్బు విడిచిన ఎండ, మొగుడు విడిచిన ముండ.

1262.పట్టు పట్టరాదు, పట్టి విడువరాదు.

1263.పడమర మెరిస్తే పది గడియలకు వర్షం.

1264.పడ్డచోటనే వెతుక్కోవాలి.

1265.పడ్డ వారెప్పుడూ చెడ్డవారు కారు.

1266.పంతులు గింతులు పావుశేరు మెంతులు ఎగరేసి కొడితే ఏడు గంతులు.

1267.పత్యం చెడరాదు సత్యం తప్పరాదు.

1268.పదిమంది నడిచింది బాట, పదిమంది పలికింది మాట.

1269.పనసకాయ దొరికినప్పుడే తద్దినం పెట్టాలి.

1270.పనిచెయ్యని వాడికి ప్రగల్భాలెక్కువ.

1271. పని, పాట లేదు పట్టుత్తా నీ కాళ్ళకైనా మొక్కుతానన్నాట్ట.

1272. పరుల సొమ్ము పాపిష్టి సొమ్ము.

1273. పరుగెత్తే వాణ్ణి చూస్తే తరిమేవాడికి లోకువ.

1274. పసిబిడ్డకు,పాలకుండకు దృష్టి తగలకుండా చూడాలి.

1275. ప్రసూతి వైరాగ్యం, పురాణ వైరాగ్యం, స్మశాన వైరాగ్యం.

1276. పాటిమీద దేవరకు కూడిమీదే లోకం.

1277. పాడి గుట్టు పంట రట్టు.

1278. పాతచుట్టం పాత చింతకాయ పచ్చడి.

1279. పాతొక రోత కొత్తొక వింత.

1280. పాత్రమెరిగి దానం క్షేత్రమెరిగి విత్తనం.

1281. పానకంలో పుడకలాగా.

1282. పాపమని పట్టెడంబలి పోస్తే కారం లేదని కచ్చేరికి ఎక్కినట్లు.

1283. పాపముంటే భయం.

1284. పాపీ చిరాయువు.

1285. పాముకు పాలుపోసి పెంచినట్లు.

1286. పాముకు బదరిక చూపినట్లు.

1287. పాము చావా చావదు, బడితె విరగా విరగదు.

1288. పాలపొంగు, పడుచు పొంగు.

1289. సాలెవాడితో, మాలవాడితో సావాసం పనికిరాదు.

1290. పాలు తాగి రొమ్ము గుద్దినట్లు.

1291. పాసినన్నం పక్వానికొస్తుందా.

1292. ప్రాణం పోయినా మానం దక్కించుకోవాలి.

1293.ప్రారబ్ధం బాగా లేకపోతే పై బట్టే పామై కరుస్తుంది.

1294.పదం తప్పినా ప్రాస తప్పరాదు.

1295.ప్రాస కోసమేడ్చానే కూనుముండా అన్నట్టు.

1296.పిండే కొద్దీ రొట్టె, తిండికొద్దీ గొడ్డు.

1297.పిచ్చి కుదిరింది రోకలి తలకు చుట్టమన్నాట్ట.

1298.పిచ్చి కుదిరితే గాని పెళ్ళికాదు. పెళ్ళైతే గాని పిచ్చికుదరదు.

1299.పిట్ట కొంచెం కూత ఘనం.

1300.పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చినట్లు.

1301.పిడుక్కు, భియ్యానికి ఒకటే మంత్రమా.

1302.పినతండ్రి పెళ్ళాం పినతల్లికాదు, మేనమామ పెళ్ళాం మేనత్తకాదు.

1303.పిల్లను చూచి పీట వెయ్యమన్నట్టు.

1304.పిలువని పేరంటం చెప్పని ఒక్కపొద్దు.

1305.పిల్లకాకి కేమి తెలుసురా ఉండేలు దెబ్బ.

1306.పిల్ల పిడికెడు, గూని గంపెడు.

1307.పిల్చి పిల్లనిస్తామంటే కులం తక్కువ అన్నట్లు.

1308.పిల్లికి ఎలుక సాక్ష్యం.

1309.పిల్లిని చంకన బెట్టుకొని పెళ్ళికి పోయినట్లు.

1310.పిల్లలేని కంపు, వానలేని వరద.

1311.పీనుగకు శృంగారంలాగా.

1312.పుండుమీద కారం చల్లినట్లు.

1313.పుండు మానినా మచ్చమానదు.

1314.పుట్టినప్పుడు పురుడు, పెరిగింతర్వాత [illegible].

1315. పుట్టని బిడ్డకు పేరుపెట్టినట్లు.

1316. పుట్టి చచ్చినా పుత్రుడే మేలు.

1317. పుట్టుట గిట్టుట కొరకే పెరుగుట విరుగుట కొరకే.

1318. పుణ్యంకొద్దీ పురుషుడు, దానం కొద్ది బిడ్డలు, ప్రారబ్ధంకొద్దీ పెళ్ళాం.

1319. పురిట్లోనే సంధి కొట్టినట్లు.

1320. పుట్టింటి మీద ఆశ, పుచ్చుమీద

1321. పుర్రెకో బుద్ధి జిహ్వాకోరుచి.

1322. పులి కడుపున మేక పుడుతుందా.

1323. పులి మీద పుట్రలాగా.

1324. పులిని చూచి నక్క వాత పెట్టుకున్నట్లు.

1325. పూజా పునస్కారాలు లేక బూజెక్కి ఉన్నానుగాని నైవేద్యం పెట్టి చూడు నా మహిమ చూపిస్తానన్నాడట.

1326. పూర్ణంలేని బూరె, వీరణం లేని పెళ్ళి.

1327. పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది పుందు పుట్టగానే వాసనేస్తుంది.

1328. పెళ్ళాం బెల్లం తల్లి దయ్యం.

1329. పెట్టిందంతా పైరూకాదు, పుట్టిన వాళ్ళంతా బిడ్డలూకారు.

1330. పెట్టినవారికి పుట్టిందే సాక్షి.

1331. పెట్టిపోతలు లేకపోయినా వట్టి కూతలు ఎందుకు.

1332. పెడితే పెళ్ళి పెట్టకపోతే పెటాకులు.

1333. పెదవి దాటితే పృథివి దాటుతుంది.

1334. పెద్ద ఇంటి రంకు, పెద్దమనిషి బొంకు తెలియవు.

1335. పెద్దలమాట చద్దిమూట.

1336. పెనానికేం తెలుసురా పెసరట్టు రుచి.

1337. పెరటి చెట్టు మందుకు పనికిరానట్లు.

1338. పేగు చుట్టమా పెట్టు చుట్టమా.

1339. పేచిలకు పెద్దకొడుకు.

1340. పేడా, బెల్లం ఒకటి చేసినట్లు.

1341. పేదవాడి పెళ్ళాం వాడకంతా వదిన.

1342. పేరొకరిది పెత్తన మొకరిది.

1343. పేరుగొప్ప ఊరుదిబ్బ.

1344. పైన పటారం, లోన లొటారం.

1345. పేనుకు పెత్తనమిస్తే తలంతా తెగ కొరికిందట.

1346. పైసాలోనే పరమాత్ముడున్నాడు.

1347. పొంగే పాలను, వెలిగే దీపాన్ని ఆర్పరాదు.

1348. పొట్ట కిచ్చినా, బట్టకిచ్చినా భూదేవే.

1349. పొట్టివాడికి పుట్టెడు బుద్ధులు.

1350. పొదుగు కోసి పాలు త్రాగినట్లు.

1351. పొద్దున్నే వచ్చిన వాన పొద్దు తిరిగి వచ్చిన చుట్టం పోరు.

1352. పొరుగూరి చాకిరి, పొరుగూరి వ్యవసాయం తనను తినేవే కాని తాను తినేవికావు.

1353. పిల్ల చచ్చినా పీతికంపు పోదన్నట్లు.

1354. పోరీ, పోరీ నీ భోగమెన్నాళ్ళే అంటే మా అత్త మాలపల్లి పోయొచ్చిందాకా అన్నదట.

1355. పొరుగు పచ్చగా ఉంటే పొయ్యిలో నీళ్ళు పోసుకున్నట్లు.

1356. పెన్న దాటితే పెరుమాళ్ళ సేవ.

1357. పేదవాడి కోపం పెదవికి చేటు.

1358. పొయ్యి ఊదినమ్మకు బొక్కెడైనా దక్కదా.

1359. పొరుగింటి పుల్లకూర రుచి.

1360. పోరునష్టం, పొందు లాభం.

1361. పులి మీసం పట్టుకొని ఉయ్యాల ఊగినట్లు.

1362. పెత్తనానికి పోతే దుత్త చేతికొచ్చిందట.

1363. పెడతానంటే ఆశ, కొడతానంటే భయం.

1364. పెళ్ళినాడే పరగడుపైతే పైన పిల్లలు కూడానా.

1365. పెళ్ళినాటి భోగం లంఖణాలనాడు తలచుకున్నట్లు.

1366. పూసల్లో దారంలాగా.

1367. పూలమ్మినచోట పుడకలమ్మరాదు.

1368. పూబోడి అంటే ఎవర్రా బోడి, నీ అమ్మ బోడి, నీ అక్క బోడి అన్నదట.

1369A. పిల్లలేని పియ్యి, వానలేని వరద అన్నట్టు.

1369. పూడ్చలేని గొయ్యి, తీర్చలేనంత అప్పు చేయరాదు.

1370. మంది ఎక్కువైతే మజ్జిగ పల్చన.

1371. పాలు కుడిచి రొమ్ము గుద్దేవాడు.

1372. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం.

1373. పదుచుల కాపురం, చితుకుల మంట.

1374. మానిన పుండును మళ్ళీ రేపినట్లు.

1375. ముందుకు వస్తే గొయ్యి, వెనక్కుపోతే నుయ్యి.

1376. మేతకరణం, కూత కరణం, వ్రాత కరణం.

1377. ముంజేతి కంకణానికి అద్దమెందుకు.

1378. పిట్టకొంచెం కూత ఘనం.

1379. పచ్చిగడ్డి వేస్తే భగ్గుమంటుంది.

1380. పట్టపగలే చుక్కలు పొడిపిస్తాట్ట.

1381. పట్టింది బంగారం, ముట్టింది ముత్యం.

1382. పట్టి విడిచిన మండ, మబ్బు విడిచిన ఎండ, మొగుణ్ణి విడిచిన ముండ.

1383. పడిశం పదిరోగాల పెట్టు.

1384. పదిమంది చావు పెళ్ళితో సమానం.

1385. పనిలేని మంగలి పిల్లితల గొరిగినట్లు.

1386. పప్పులేని పెళ్ళి ఉప్పులేని కూర.

1387. పరుగెత్తే వాణ్ణి చూస్తే తరిమేవాడికి లోకువ.

1388. పాలకు వచ్చి ముంత దాచినట్లు.

1389. పాటిమీద గంగానమ్మకు కూటిమీదే లోకం.

1390. పాటు పడితే కూడికి కొదవా.

1391. పాడూళ్ళో పోత రాజు.

1392. పాడిందే పాడరా పాచిపళ్ళ దాసరి.

1393. పిట్టకొంచెం కూత ఘనం.

1394. పిలవని పేరంటం, చెప్పని ఒక్క పొద్దు.

1395. పిల్లి కళ్ళు మూసుకొని పాలు త్రాగుతూ తననెవరూ ఎరుగరని ఎంచుకున్నట్లు.

1396. పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణ సంకటం.

1397. పొట్టివాడికి పుట్టెడు బుద్ధులు.

1398. పేరొకరిది, పెత్తనమొకరిది.

1399. పొయ్యి ఊదినమ్మకు గుక్కెడైనా దక్కుతుంది.

1400. పొరిగింటి పుల్లకూర రుచి.

1401. పొరుగు పచ్చగా ఉంటే పొయ్యిలో నీళ్ళు పోసుకున్నట్లు.

1402. పోతే మొగుడు పొయ్యాడు కాని, పొన్నకాయలా కుదిరింది తల.

1403. పోరు నష్టం, పొందులాభం.

1404. బర్రె చస్తే పాడి బయటపడుతుంది.

1405. బ్రతికుంటే బలుసాకు తినొచ్చు.

1406. బాలల తుమ్ము, బాలింత తుమ్ము మంచిది.

1407. బావ మరుదుల బ్రతకకోరును, దాయాదుల చావు కోరును.

1408. బిడ్డ వచ్చిన వేళ, గొడ్డు వచ్చిన వేళ.

1409. బుద్ధి భూములేలుతుంటే కర్మ గాడిదలు కాస్తానందట.

1410. బోగందానికి వలపు, బొగ్గుకు తెలుపులేదు.

1411. భరతుడికి పట్టం, రాముడి రాజ్యం.

1412. బాలవాక్కు బ్రహ్మవాక్కు.

1413. మంగలంలో పేలాల వలె.

1414. మంగలి పాత, చాకలి కొత్త.

1415. మంచం అల్లలేని మగవాడు, మజ్జిగ చిలకలేని ఆడది.

1416. మంచమున్నంత వరకే కాళ్ళు చాచుకోవాలి.

1417. మంచమెక్కి వరస అడిగినట్లు.

1418. మంచి కాలానికి మామిళ్ళు, చెడు కాలానికి చింతలు కాస్తా యట.

1419. మంచికి పోతే చెడు ఎదురైనట్లు.

1420. మంచి గొడ్డుకో దెబ్బ మంచి మనిషికో మాట.

1421. మంత్రసాని తనం ఒప్పుకున్న తర్వాత ఏదొచ్చినా పట్టాలి.

1422. మంత్రసాని దగ్గర మర్మం దాచినట్లు.

1423. మంత్రాలకు చింతకాయలు రాలుతాయా.

1424. మందుకు పత్యం, మాటకు సత్యం.

1425. మగవాడు తిరక్క చెడ్డాడు. ఆడది తిరిగి చెడింది.

1426. మడికి గట్టు, ఇంటికి గుట్టు.

1427. మతిలేనమ్మకు గతిలేని మొగుడు.

1428. మన దీవమని ముద్దాడితే మూతిమీద మీసాలు తెగకాలకుండా ఉంటాయా.

1429. మసిగుడ్డతో మంచినీళ్ళు ఇచ్చాట్ట.

1430. మనసులేని మనువులాగా.

1431. మనసుకు మనసే సాక్షి.

1432. మనస్సులోని మర్మం, నీళ్ళలోని లోతు ఎవరూ ఎరుగరు.

1433. మనిషికి ఉన్నది పుష్టి. వనరానికి తిన్నది పుష్టి.

1434. మమ్మగడువు పెళ్ళి కొడుకులాగా.

1435. మనుషులు పోయినా మాటలు నిలుస్తాయి.

1436. మనోవ్యాధికి మందులేదు.

1437. మల్లిని చెయ్యబోతే పిల్లి అయినట్లు.

1438. మట్టిలో మాణిక్యంలాగా.

1439. పానకంలో పుడకలాగా.

1440. పామూ చావనివ్వడు, బడితే విరగనివ్వడు.

1441. పాసిన అన్నం పక్వానికొస్తుందా.

1442. పుట్టని బిడ్డకు పేరు వెతికాట్ట.

1443. పుట్టని బిడ్డకు పూసలు కట్టినట్లు.

1444. పుణ్యం పుట్టెడు, పురుగులు తట్టెడు.

1445. పుణ్యానికి పెట్టే అమ్మా నీ మొగుడితో సమానంగా పెట్ట మన్నట్లు.

1446. పుబ్బలో చల్లేదానికన్నా దిబ్బలో చల్లడం మేలు.

1447. పులి కడుపున మేక పుడుతుందా.

1448. పూజకొద్దీ పురుషుడు, పుణ్యం కొద్దీ పుత్రుడు.

1449. పూవులమ్మినచోట కట్టెలమ్మినట్లు.

1450. పెరటిచెట్టు మందుకు పనికిరాదు.

1451. పేదవాడి కోపం పెదవికి చేటు.

1452. ప్రయాణం అబద్ధం, ప్రసాదం నిబద్ధి.

1453. ప్రాణం మీద తీపా, బెల్లం మీద ప్రీతా.

1454. ప్రీతితో పెట్టింది పిడికెడు చాలు.

1455. ప్రీతిలేని కూడు పిండా కూటితో సమానం.

1456. బంగారు పిచ్చుక.

1457. బట్టతలకు, మోకాళ్ళకు ముడివేసినట్లు.

1458. బూడిదలో పోసిన పన్నీరు.

1459. బ్రహ్మ ద్వేషం పుట్టినా, అన్న ద్వేషం పుట్టినా ఎక్కువ కాలం బ్రతకడు.

1460. బతకని బిడ్డ బారెడు.

1461. బ్రహ్మాస్త్రానికి తిరుగులేదు.

1462. బ్రాహ్మల్లో చిన్న, బెస్తల్లో పెద్ద.

1463. భోజనానికి ముందు, స్నానానికి వెనుక.

1464. భోజరాజులాంటి రాజు ఉంటే కాళిదాసులాంటి కవి అప్పుడే ఉంటాడు.

1465. మాటలు కోటలు దాటుతాయిగాని కాళ్ళు గడపదాటవు.

1466. ముగ్గురు ఆడవారు కూడితే పట్టపగలే చుక్కలు పొడుస్తాయి.

1467. ముండ పెంచిన బిడ్డ ముక్కుతాడులేని ఎద్దుతో సమానం.

1468. ముంజేతి కంకణానికి అద్దమేలా.

1469. పూటకూళ్ళమ్మ పుణ్యమెరుగదట.

1470. పెట్టిన వాంకి పుట్టిందే సాక్షి.

1471. పుర్రెకో బుద్ధి, జిహ్వకో రుచి.

1472. బెల్లమున్న చోటే ఈగలు ముసురుతాయి.

1473. భల్లూకపు పట్టు.

1474. భిక్షాధికారైనా కావాలి. లక్షాధికారైనా కావాలి.

1475. మాటకు మాట తెగులు, నీళ్ళకు నాచు తెగులు.

1476. మేకవన్నె పులి.

1477. మొదటికి మోసం లాభానికి గుద్దులాట.

1478. మన్నుతిన్న పాము.

1479. మొగుణ్ణి కొట్టి మొగసాల కెక్కినట్లు.

1480. మక్కాకు పోయి కుక్క మలం తెచ్చినట్లు.

1481. మందుకు పోయిన వాడు మాసికానికొచ్చినట్లు.

1482. మఖలో పుట్టి, పుబ్బలో పోయినట్లు.

1483. మతిలేని మాట, శృతిలేని పాట.

1484. మసిపూసి మారేడుకాయ చేసినట్లు.

1485. మాంసం తింటామని ఎముకలు గ్రుచ్చి మెళ్ళో వేసుకుంటామా.

1486. మాటలు తేటలు మా యింట , మాపటి భోజనం మీ ఇంట.

1487. మాఘమాసపు వాన, మొగుడు లేని చాన.

1488. మాదిగ మంచానికి తలవైపు, కాళ్ళవైపు ఒకటే.

1489. మానింది మందు.

1490. మింగ మెతుకు లేదు. మీసాలకు సంపెంగ నూనె అన్నాట్ట.

1491. మిండలను మరిగిన అమ్మ, మీగడ తిన్న అమ్మ ఊరుకుండదు.

1492. మిడతంభొట్లు జోస్యం.

1493. మిన్ను విరిగి మీద పడ్డట్లు.

1494. మీ ఇంటికొస్తాను నాకేం పెడతావు, నా ఇంటికొస్తావు నాకేం తెస్తావు.

1495. ముళ్ళకంపమీద పడ్డ గుడ్డ మెల్లగా తీసుకోవాలి.

1496. ముందున్నది ముసళ్ళ పండుగ.

1497. ముందొచ్చిన చెవులకన్నా వెనక వచ్చిన కొమ్ములు వాడి.

1498. ముక్కున్నంత వరకూ పడిశం ఉండేదే.

1499. ముద్దుచేసిన కుక్క మూతి కరిచిందట.

1500. ముక్కు, ముఖం తెలియనివాడు.

1501. మురిపెం తిరిపెం చేటు, ముసలి మొగుడు ప్రాణానికి చేటు.

1502. ముల్లుతో తీస్తే పొయ్యేదానికి దబ్బనంతో తీసినట్లు.

1503. ముసుగులో గుద్దులాట.

1504. మూడు నెలలు సాముచేసి మూలనున్న ముసలిదాన్ని కొట్టాట్ట.

1505. ముండల ముఠాకోరు.

1506. మూడేళ్ళనాటి గుణం నూరేళ్ళ వరకూ ఉంటుందట.

1507. మృగశిర కురిస్తే ముసలి ఎద్దు కూడా రంకె వేస్తుంది.

1508. మెచ్చి మేకతోలు కప్పమన్నాట్ట.

1509. మెత్తని వాణ్ణే చూస్తే మొత్తబుద్ధి అయిందట.

1510. మేడిపండులాగా.

1511. మొండికి తగ్గ మిండడు.

1512. మొండికెక్కిన దాన్ని మొగుడేం చేస్తాడు, రచ్చకెక్కిన దాన్ని రాజేం చేస్తాడు.

1513. మొండివాడు రాజుకంటే బలవంతుడు.

1514. మ్రొక్కబోయిన దేవర ఎదురుగా వచ్చినట్లు.

1515. మ్రొక్కేవాడికి వెరవాలా, మొట్టేవాడికి వెరవాలా.

1516. మొగుడు కొట్టినందుకు కాదు తోడికోడలు నవ్వినందుకు

ఏడ్చిందట.

1517. మొగుడు చచ్చి మొర్రో అంటుంటే మిండ మొగుడు వచ్చి బిడ్డను పుట్టిస్తాలే అన్నాట్ట.

1518. మొదట మానెడు, దూడచస్తే దుత్తెడు.

1519. మొదట మోదుగ పూస్తే, కొసన సంపెంగ పూస్తుందట.

1520. మొరిగే కుక్క కరవదు.

1521. మోచేతి క్రింద నీళ్ళు త్రాగినట్లు.

1522. మూడునాళ్ళ ముచ్చట.

1523. యోగికి, భోగికి, రోగికి నిద్రరాదు.

1524. పూచిన పూలల్లా కాయలవుతాయా.

1525. మాచెర్ల దొరలకు మీసాలు లేవు, పల్నాటి దొరలకు వాసాలు లేవు.

1526. మాచకమ్మ సమర్త మఖ అయినా ఒకటే, పుబ్బ అయినా ఒకటే.

1527. మార్గశిరంలో మాట్లాడ్డానికి పొద్దుండదు.

1528. మామా ఒక ఇంటి అల్లుడే, అత్తా ఒక ఇంటి కోడలే.

1529. మిద్దె మీద పరుగు, మీసాలమీద మెరుగు.

1530. మీ ఇంట్లో భోంచేసి మా ఇంట్లో చెయ్యి కడుక్కోమన్నట్లు.

1531. మీసాలు వచ్చేటప్పుడు దేశాలు కానరావు.

1532. ముఖాలు చూచి బొట్లు పెడతారు, పిల్లను చూచి పీట వేస్తారు.

1533. ముద్ద ముద్దకు బిస్మిల్లా.

1534. ముద్దుచేసిన కుక్క మూతి కరిచింది, చనువు చేసిన భార్య చంకకెక్కింది.

1535. మున్నూరు శిఖలైనా కూడవచ్చును కాని మూడు కొప్పులు కూడరాదు.

1536. ముప్పూట తిన్నమ్మ మూర్ఛపోయిందట.

1537. ముప్పొద్దు తిన్నమ్మ మొగుడాకలెరుగదట.

1538. ముల్లొచ్చి అరిటాకుమీద పడ్డా, అరిటాకు వచ్చి ముల్లు మీద పడ్డా అరిటాకుకే మోసం.

1539. ముష్టికి మూడు సంచులా.

1540. ముసలి కాలానికి కుసుమరోగం.

1541. ముణ్ణాళ్ళ ముచ్చట.

1542. మూడు మాటలు, ఆరు తప్పులు.

1543. మూడు పావలాల గుడ్డ, ముప్పై రూపాయల కుట్టు.

1544. మూరెడు ఇంట్లో బారెడు కర్ర ఎట్లా కొడతావు. కొట్టరా మొగడా అందట.

1545. మూల ముంచుతుంది, జ్యేష్ట తేలుస్తుంది.

1546. మూల విరాట్టు ముప్పైత్తుకుంటుంటే ఉత్సవిగ్రహాలకు దద్దో జనం కావాలన్నాడట.

1547. మూలిగే నక్కమీద తాటికాయపడ్డట్టు.

1548. మూసి పెడితే పాసిపోయిందట.

1549. మెడలో రుద్రాక్షలు, మదిలో మధిరాక్షలు.

1550. మెతుకులు చల్లితే కాకులకు కొదవా?

1551. మేయబోయి మెడకు తగిలించుకున్నట్లు.

1552. మేకపిల్లను చంకన బెట్టుకొని మేడలన్నీ వెతికినట్లు.

1553. మేడసావికుళానికి మంగసాని డోలు.

1554. మొండికెత్తితే మొగుడేం చేస్తాడు. బండ కెక్కితే బావేం చేస్తాడు.

1555. మొక్కజొన్న కండె మొదలు, పొగాకు చివర.

1556. మొక్కై వంగనిది మానై వంగుతుందా?

1556A. ముందున్నది ముసళ్ళ పండుగ.

1557. మొగబుద్ధి మోటుబుద్ధి, ఆడబుద్ధి అపరబుద్ధి.

1558. మొహమాటానికి పోతే ముండ గర్భిణి అయిందట.

1558A. మొగుడు కొర్దీ వన్నెలు, సిరికొర్దీ చిన్నెలు.

1559. మొలబంటి దుఃఖం మోకాలి బంటి సంతోషం.

1560. మోటువాడికేం తెలుసు మొగలిపువ్వు వాసన?

1561. మోటువాడికి మొగలి పువ్వు ఇస్తే మడిచి ముడ్లో పెట్టు కున్నాట్ట.

1562. మారు మనువు చేసుకొని మొదటి మొగుడికి సుద్దులు చెప్పిందట.

1563. మిండగాడు దబ్బివ్వకపోతే మొగుడితో పోయినట్లు అనుకుం టాను పొమ్మన్నదట.

1564. ముంజె ముదిరినా, లంజె ముదిరినా కొరగాదు.

1565. ముండమోపి బలుపు, పాండురోగి తెలుపు.

1566. ముండాకాదు, ముత్తైదువా కాదు.

1567. ముందరి కాళ్ళకు బంధాలు.

1568. ముందు నడిచే ముతరాసువాణ్ణి, వెనుక వచ్చే ఏనాది వాణ్ణి నమ్మరాదు.

1569. ముందే ముక్కిడి, పైన పడిశం.

1570. ముక్కు పట్టిన ముత్యం, చెవు పట్టని కమ్మ.

1571. ముక్కు మూరెడు, శిగ బారెడు.

1572. ముక్కు, మొగములేని బిడ్డ, మొదలు తుదిలేని పాట.

1573. ముగ్గురు బిడ్డల్ని కంటే ముసలాడికైనా కొరగాదు.

1574. ముట్లుడిగిన తర్వాత సమర్తె సారె పెట్టినట్లు.

1575. ముడ్డిమీద తన్నితే మూతిపళ్ళు రాలినట్లు.

1576. ముడ్డిలో పుండ్లు, మేనమామ వైద్యం, మానంలో పుండు మామగారి వైద్యం.

1577. మూడురోజులుంటే మురికి చుట్టం.

1578. మూడునాళ్ళ ముత్తైదువతనానికి ఆరుజోళ్ళ లక్కాకులు.

1579. మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్లు.

1580. మేస్త్రీలు మేడగడితే కుక్కకాలు తగిలి కూలిపోయిందట.

1581. మేహ జాడ్యం, తోట సేద్యం ఏనాటికి ఒగదెగవు.

1582. మొదటిదానికి మొగుడేలేడు, కడదానికి కళ్యాణం కావాలట.

1583. మొదలే కుంటికాలు, దానికితోడు పక్షవాతం.

1584. మొలది విప్పి తలకు చుట్టినట్లు.

1585. మౌనం అర్ధాంగీకారం.

1586. యతికోసం పోతే మతి పోయినట్లు.

1587.యతి మతం మొగుడికి ఎత్తుభారపు పెళ్ళాం.

1588.యదార్థవాది లోక విరోధి.

1589.యముడన్నా, శివుడన్నా వెరవని వాడుండడు.

1590.యాదవ కులంలో ముసలం పుట్టినట్లు.

1591.రంకు నేర్చినమ్మ బొంకునేర్వదా?.

1592.రాగం రానివాడు, రోగం లేనివాడు లేడు.

1593.రానున్న శని రామేశ్వరం పోయినా తప్పదు.

1594.రాచ పీనుగ తోడు లేకుండా పోదు.

1595.రాజును చూచిన కంట మొగుణ్ణి చూస్తే మొట్టబుద్ధి అయిందట.

1596.రాజుగారి భార్య మేడెక్కితే కుమ్మరి వాడి కోడలు గుడె సెక్కిందట.

1597.రాముడిలాంటి రాజుంటే హనుమంతుడిలాంటి బంటు అప్పుడే పుడతాడు.

1598.రెక్కలు తెగిన పక్షిలాగా.

1599.రామాయణమంతా విని రాముడికి సీతేం కావాలి అన్నాట్ట.

1600.రామాయణంలో పిడకలవేట.

1601.రొట్టె విరిగి నేతిలో పడ్డట్టు.

1602.రూకలేని వాడు పోక చేయలేడు.

1603.రాతి కుండకు ఇనపతెడ్డు.

1604.రోట్లో తలపెట్టి రోకటి పోటుకు వెనుతీయడంలాగా.

1605.రామేశ్వరం పోయినా శనేశ్వరం తప్పనట్లు.

1606.రామాయణం రంకు, భారతం బొంకు.

1607.రామరాజ్యంలో తిండికరువా?.

1608.రాజు మెచ్చింది మాట, మొగుడు మెచ్చింది రంభ.

1609.యధా రాజా తథా ప్రజా.

1610.రాజులసొమ్ము రాళ్ళపాలు.

1611.రెడ్డివచ్చె మొదలాడ మన్నట్లు.

1612.రేగుచెట్టు క్రింద గ్రుడ్డివాడిలాగా.

1613.రొట్టెల వాడికంటే తునకలవాడు ఘనుడు.

1614.రోలు వెళ్ళి మద్దెలతో మొరపెట్టుకున్నదట.

1615.రాతుకొద్దీ గుర్రం.

1616.రోహిణీ కార్తె ఎండలకు రోళ్ళు పగులుతాయట.

1617.రథసప్తమి నాటికి రథాలు తిరుగుతాయట.

1618.రట్టు, రవ్వ రావిపాటి వారిది, పుస్తె, పూస పూసపాటి వారిది.

1619.రత్నాలన్నీ ఒకచోట, రాళ్ళన్నీ మరొకచోట.

1620.రామాపతి, సీతాపతి పొద్దున్నే లేస్తే పొట్టేగతి.

1621.రాజ్యం వీరభోజ్యం.

1622.రాజన్నా, రెడ్డన్నా ఒకటే.

1623.రాజుగారి కొడుకైనా కావాలి, పాని దానికి తమ్ముడైనా కావాలి.

1624.రాజుగారి మొదటి భార్య ప్రతివత అంటే రెండో భార్య .......

1625.రాజు తలిస్తే దెబ్బలకు కొదవా.

1626.రాజులేని ఊళ్ళు, పూజలేని గుళ్ళు.

1627.రాముడి పాదాలు తగిలితే రాళ్ళు రమణులవుతారు.

1628.రాముడివంటి దేవుడు, రావణుడి వంటి రాక్షసుడు లేడు.

1629.రాళ్ళ చేనే రత్నాలు పండుతుంది.

1630.రావణాసురుడి కాష్టంలాగా.

1631.రెండు చేతులతో కొడితేనే చప్పుడవుతుంది.

1632.రొయ్యకు లేదా బారెడు మీసం.

1633.రోగం రట్టు, సంసారం గుట్టు.

1634.రోజూ చచ్చేవాడికి ఏడ్చేవాడెవడు.

1635.రోషానికి పోయి రోలు మెడకు కట్టుకున్నట్లు.

1636.రమ్మన్నారు తిమ్మన్న బంతికి.

1637.రవి గాంచనిచోట కవి గాంచునే.

1638.రావిచెట్టుకి ప్రదక్షిణాలు చేస్తే బిడ్డలు పుడతారంటే చుట్టు చుట్టుకు పొట్ట చూసుకుందట.

1639.రాయని భాస్కరుడు.

1640.రుచి మరిగిన పిల్లి ఉట్టిమీద కెక్కినట్లు.

1641.రుద్రాక్ష పిల్లి వంటివాడు (కపట సన్యాసి, మోసగాడు).

1642.రూపం వల్ల స్త్రీలు, పరాక్రమం వల్ల పురుషులు రాణిస్తారు.

1643.రెంటికి చెడ్డ రేవడులాగా.

1644.రెండావుల పాలు తాగిన దూడలాగా.

1645.ఎడ్డి, మడ్డి, బంగారు కడ్డి.

1646. రెడ్లల్లో రకాలు, వడ్లలో రకాలు చెప్పలేం.

1647. రైతు క్షేమం, రాజు భాగ్యం.

1648. రెండూ రెండే, రెంటికీ వుండే.

1649. రోగం ఒకటి, మందొకటి.

1650. రోగాల్లోకెల్లా గురక ప్రమాదం.

1651. రోగాలు మనుషులకు కాక మానులకొస్తాయా.

1652. రోగీ పాలే కోరరాదు, వైద్యుడూ పాలే చెప్పాడు.

1653. రోటి పాట రోకటి పాట.

1654. రోషంలేని బంటుకు మోసంలేదు.

1655. రెక్కాడితేకాని డొక్కాడదు.

1656. రక్షించిన వాణ్ణే భక్షించినట్లు.

657. రానిపాట పాడ వేడుక బోడితల అంట వేడుక.

1658. రాను రాను రాజు గుర్రం గాడిద అయిందట.

1659. రానూ వచ్చె, పోనూపోయే, రాగులు విసరి సంకటి చేయండి అన్నాట్ట.

1660. లంక మేతకు ఏటి ఈతకు సరి.

1661. లంకలో పుట్టిన వాళ్ళంతా రాక్షసులే.

1662. లంఖణానికి పెడితే పత్యానికి దిగుతుంది.

1663. లంచమిస్తేగాని మంచమెక్కడు.

1664. లంజకు నిగ్గు సంసారికి సిగ్గు ఉండాలి.

1665. లంజకు పిల్ల తగలాటకం.

1666. లగ్గమంటే పగ్గమన్నట్లు.

1667. లంజ చస్తేనేం మంచ మిరిగితేనేం.

1668. లాభం గూబలోకి వచ్చినట్లు.

1669. లాజు శేసిదే సెట్టి వరదనబడిపోడు.

1670. లేక లేక లోకాయి పుడితే లోకాయ కన్ను లొట్ట బోయిందట.

1671. లేడికి లేచిందే ప్రయాణం.

1672. లేని దాతకంటే ఉన్న లోభి నయం.

1673. లేనిపోని పీకులాట చావడిదాకా గుంజులాట.

1674. లేనివాడు లేక ఏడిస్తే ఉన్నవాడు తినలేక ఏడ్చాడట.

1675. లేవలేని అత్త ఒంగలేని కోడలు.

1676. లేస్తే మనిషిని కాదు అన్నట్లు.

1677. లోకులు పలుగాకులు.

1678. లోగుట్టు పెరుమాళ్ల కెరుక.

1679. లోన లొటారం పైన పటారం.

1680. లోభి సొమ్ము లోకులపాలు.

1681. బెల్లం కొట్టిన రాయిలాగా.

1682. లోభికి మూట నష్టం.

1683. లోకాభి రామాయణం.

1684. లక్ష నక్షత్రాలైనా ఒక చంద్రుడు కాదు.

1685. లేనిదానికోసం పోతే ఉన్నది ఊడిపోయినట్లు.

1686. లేవలేని అత్తకు ఓపలేని కోడలు.

1687. లంకంత కొంప.

1688.రెక్కలు తెగిన పక్షి.

1689.రాజ్యాలు పోయినా రాజసాలు పోలేదు.

1690.రాణివాసం వచ్చి మూలవాసం పీకిందట.

1691.రాత పొడిచినా చావులేదు.

1692.రాత్రికి వెన్నెల పస, పైరుకు వెన్నులు పస.

1693.రెండూ రెండే రెంటికీ కుళ్ళే.

1694.రోగం ఒకటైతే మందొకటిచ్చాట్ట.

1695.రోటిపాట, రోకటి పాట.

1696.లక్కజొచ్చిన నగ, నక్క జొచ్చిన ఇల్లు.

1697.లక్ష భక్ష్యాలు తినే కుక్షికి ఒక భక్ష్యం లక్ష్యమా.

1698.లేకుండా చూచి పోకుండా పట్టమన్నట్లు.

1699.లంకా దహనం.

1700. లంకను కాల్చిన వాడు రాముడి లెంక.

1701.వయసువస్తే వంకలు తీరతాయి.

1702.వంకాయ వంటి కూరాలేదు, శంకరుడి వంటి దైవంలేదు.

1703.వంగకు ముదురు నాటు, అరటికి లేత నాటు.

1704.వంగతోటకాడ మాత్రం వదిన అని అనవద్దు అన్నట్లు.

1705.వంట ఇంటి కుందేలు లాగా.

1706.వండని కూడు, వడకని బట్ట.

1707.వండలేనమ్మకు వగలు మెండు, తేలేనమ్మకు తిండి మెండు.

1708.వండనమ్మకన్న దండుకున్నమ్మ మేలు.

1709. వండుకున్నమ్మకు ఒక్కటే కూర, అడుక్కుతినే అమ్మకు అరవై ఆరు కూరలు.

1710. వగలాడీ నీ మొగులెందరే అంటే తాళి మొగుడితో తొంభై మంది అందట.

1711. వచ్చిన నాడు వరా చుట్టం, మర్నాడు మాడచుట్టం, మూడవనాడు మురికి చుట్టం.

1712. వచ్చినపేరు చచ్చినాపోదు.

1713. వచ్చీరానీ మాటలు, ఊరీ ఊరని ఊరగాయ రుచి.

1714. వట్టిగొడ్డుకు అరుపులెక్కువ, వానలేని మబ్బుకు ఉరుములెక్కువ.

1715. వడ్డించే వాడు మనవాడైతే కడపటి బంతిని కూర్చున్నా ఒకటే.

1716. వడ్డి, ఉప్పర, సభా మధ్యే, వైదీతః పండితోత్తమ.

1717. వడ్డెరోడికి పెళ్ళాం పెద్దది కాపోడికి గొడ్డు పెద్దది కావాలట.

1718. వడ్ల గింజలోది బియ్యపు గింజ.

1719. వనిత కాని, కవిత కాని వలచి రావలసిందే.

1720. వరహాకన్నా వడ్డీ ముద్దు, కొడుకుల కన్నా మనవడు ముద్దు.

1721. వసుదేవుడు పోయి గాడిద కాళ్ళు పట్టుకున్నట్టు.

1722. వస్తూ ఏం తెచ్చావు, పోతూ ఏ మిచ్చిపోతావు.

1723. వస్తావన్నదాన్ని, ఇస్తానన్నవాణ్ణీ నమ్మరాదు.

1724. వస్తావయ్యా బాపనయ్యా అంటే వద్దే ముండా వర్జ్యముంది అన్నాట్ట.

1725.వాడ వదిన కేలరా వావి వరుసలు.

1726.వాతాపి జీర్ణం, వజ్ర శరీరం.

1727.వాన వుంటే కరువు, వెనిమిటి ఉంటే పేదరికం లేదు.

1728.వాన రాకడ, ప్రాణం పోకడ ఎవరికీ తెలియదు.

1729.వాపు బలుపూ కాదు, వాత అందమూకా దు.

1730.వాములు మింగే స్వాములకు పచ్చిగడ్డి ఫలహారమా.

1731.వాసానికి తగిన కూసం.

1732.వాసి తరిగితే వన్నె తరుగుతుంది.

1733.వావి వరుసలు తప్పి వర్తిస్తే చెడిపోతారు.

1734.వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తులాభారం తూగితే కారెడ్ల కారెక్క వంకాయల భారం తూగిందట.

1735.వాస్తుగలవారి కోడలు వరహా ఇచ్చి క్షవరం చేయించుకున్న దట.

1736.వింటే బేగడ (ఒకరాగం) వినాలి, తింటే మీగడ తినాలి.

1737.వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి.

1738.విందైనా మందైనా మూన్నాళ్ళు.

1739.వింత లేకుండా ఆవలింతరాదు.

1740.విగ్రహపుష్టి నైవేద్య నష్టి.

1741.విఘ్నేశ్వరుడి పెళ్ళికి వేయి విఘ్నాలు.

1742.విడిచింది వీధికి పెద్ద, బరితెగించింది బజారుకు పెద్ద.

1743.విడిచిన ముండకు వీరేశలింగం, తెగించిన వాడికి తెడ్డే లింగం.

1744.విత్తం కొద్దీ విభవం, విద్యకొద్దీ వినయం.

1745. విత్తనం మర్రి వృక్షానికెంత.

1746. విత్తు ఒకటి వేస్తే చెట్టు ఒకటి మొలుస్తుందా.

1747. విత్తు ముందా చెట్టుముందా.

1748. విత్తులు తీసిన కోడె, ఈకలు తీసిన కోడి.

1749. విదియనాడు కనపడని చంద్రుడు తదియనాడు తనంతట తానే కనపడతాడు.

1750. విధవకు తల సుడులు వెతికినట్లు.

1751. విధవకు మొక్కితే నాలాగా నూరేళ్ళు వర్ధిల్లమందట. రెండో సారి మొక్కితే నా మొగుడిలాగా వర్ధిల్లమందట.

1752. వినరాదు, కనరాదు, అనరాదు (చెడు)

1753. వినయం లోక వశీకరణం, విద్య రాజు వశీకరణం.

1754. వినాయకుడి మీది భక్తా, ఉండ్రాళ్ళమీద భక్తా.

1755. విన్నమ్మకు వీపు కాలింది, కన్నమ్మకు కడుపు కాలింది.

1756. వియ్యానికైనా, కయ్యానికైనా సాటి వారుండాలి.

1757. విభూతి పట్టెలు పెట్టుకుంటే విష్ణుమూర్తి ననుకున్నానే, ఓహో ఆంజనేయుడి వటోయ్ వెంకటేశ్వర్లు అన్నాడట.

1758. విరజాజి పూదండ విధవకేల.

1759. విశాఖ చూచి విడవర కొంప, ఉత్తర చూచి ఎత్తరగంప.

1760. విశాఖ వరదలు, సంక్రాంతి మబ్బులు.

1761. విషంలో పుట్టిన పురుగు విషంలోనే జీవిస్తుంది.

1762. విసరగా విసరగా రాయి, తిట్టగా తిట్టగా తిట్టు తగులుతుంది.

1763. విస్సన్న చెప్పిందే వేదం.

1764. వీలెరిగి మాట, కీలెరిగి వాత.

1765. వృద్ధనారీ పతివ్రత.

1766. వృద్ధ వైద్యం, బాల జోస్యం.

1767. ఎంకిపెళ్ళి సుబ్బి చావుకు వచ్చిందట.

1768. వెంట్రులున్నమ్మ ఏ కొప్పైనా పెడుతుంది.

1769. వెంపలి చెట్లకు నిచ్చెన వేసినట్లు.

1770. వెక్కిరించబోయి బోర్లపడినట్లు.

1771. వెర్రి వేయి విధాలు.

1772. విధవ ముండకైనా వేవిళ్ళు తప్పవు.

1773. వెనుక తుమ్ము ముందుకు లాభం.

1774. వెన్న తిన్నవాడు వెళ్ళిపోగా చల్ల తాగినవాణ్ణి చావబాదిందట.

1775. వెన్న పెడితే మింగలేడు, వేలు పెడితే కొరకలేడు.

1776. వెయ్యిళ్ళ పూజారి వెతికినా దొరకడు.

1777. వెర్రికుదిరింది రోకలి తలకు చుట్టమన్నాట్ట.

1778. వెర్రి మొద్దుకేల వేద శాస్త్రాలు.

1779. వెలయాలి మాట కలలో మూట.

1780. వెలయాలికిచ్చిన సొమ్ము, గోడకు వేసిన సున్నం తిరిగిరావు.

1781. వెల్లటూర్లో ఎద్దును, పర్చూరులో పడుచును ఇవ్వరాదు.

1782. వేగీ వేగనమ్మ వేకువ జామున ముట్టయితే తెలవిగలమ్మ తెల్లవారు జామున ముట్టయిందట.

1783. వేగవేగని పెసరపప్పు వెనక వచ్చిన పెళ్ళాము రుచి అంట.

1784. వేన్నీళ్ళకు చన్నీళ్ళు తోడైనట్లు.

1785. వేములు కాస్తే భూములు పండుతాయట.

1786. వేలం వెర్రి గొర్రిగాటు.

1787. వేలు పెట్టే సందు ఇస్తే కాలు దూర్చినట్లు.

1788. వేలుకు వేస్తే కాలికి, కాలికి వేస్తే వేలికి వేసినట్లు.

1789. వైద్యుడి పెళ్ళాం కూడా ముండ మోసేదే అన్నాట్ట.

1790. వ్యాసప్రోక్తమా, పరాశర ప్రోక్తమా అన్నట్లు.

1791. వ్రతం చెడ్డ సుఖం దక్కాలి.

1792. వ్రాసేవాణ్ణి, కోసేవాణ్ణి, గీసేవాణ్ణి నమ్మరాదు.

1793. వంశమెరిగి వనితను, వన్నె ఎరిగి పశువును కొనాలి.

1794. వగలమారి వంకాయ శగ తాకగానే నగమైంది.

1795. వచ్చిన వాడు చచ్చిన పోదు.

1796. వడ్లువాగున పోతేనేం, గడ్డి గాలిన పోతేనేం.

1797. వయసు తప్పినా వయ్యారం తప్పలేదు.

1798. వాగుదాటేదాకా ఓడమల్లయ్య, వాగుదాటిన తర్వాత బోడి మల్లయ్య.

1799. విసిరినమ్మకు బొక్కిందే కూలి.

1800. వూరుకోలేక వురి పోసుకున్నట్లు.

1801. వెనక ముందు చూచి మాట్లాడాలి.

1802. వెలలేని మాణిక్యం.

1803. వేలు మీద గోరు మొలిచింది, వేరే పోదాం రారా వెర్రి మొగడా అందట.

1804. వేళ్ళల మొక్కులు వెయ్యేళ్ళు.

1805.వచ్చేదల్లా రానీ పోయేదల్లా పోనీ.

1806.విడవమంటే పాముకు కోపం, పట్టుమంటే కప్పకు కోపం.

1807.వీపు మీద కొట్టొచ్చుగాని కడుపు మీద కొట్టరాదు.

1808.వేయి వరహాలు పెట్టి ఏనుగుకొనేవాడు అరవీసంపెట్టిఅంకుశంకొనడానికి పాలుమాలతాడా.

1809.వెల్లకిలాపడుకుని ఉమ్మేస్తే తన ముఖంమీదనే పడుతుంది.

1810.వేషాలెన్ని వేసినాగ్రాసాలకోసమే.

1811.వెర్రిపామ్మంటే చూరుపట్టుకు వ్రేళ్ళాడినట్లు.

1812.వండమని అక్కకాళ్ళు మొక్కాలి. వినమని బావకాళ్ళు మొక్కాలి.

1813.వండలేనమ్మకు వలపులు మెండు. తేలేనమ్మకు తీపులు మెండు.

1814.వాదినాశనం. ప్రతివాది ముదనష్టం, ప్లీడర్ల అదృష్టం,కోర్టు వారి ఇష్టం.

1815.వానబడాయి చవిటి మీద, మాలబడాయి పాటి మీద, భర్త బడాయి భార్య మీద.

1816.విప్రహస్తం, ఏనుగు తొండం ఊరుకోవు.

1817.వియ్యపు రాలికి వీపుదెబ్బలు,నాకుతోపుదెబ్బలు.

1818.విరుగుబాటుపైన మానె బొట్టు,విరిచి కట్లపైన పెరుగు బొట్టు.

1819.వియ్యపురాలి పేరు విసరమ్మ,నా పేరు దంచమ్మా.

1820.విషపాళెపు విత్తు,నేపాళెపు గింజ.

1821.వెతక పోయిన తీర్థం ఎదురైనట్లు.

1822. వెన్నపూస వాళ్ళో ఉంచుకొని నేతికి సం తడుముకున్నట్లు.

1823. వెన్నలో వెంట్రుకలు తీసినట్లు.

1824. వెన్నెలకొన్నాళ్ళు,చీకటి కొన్నాళ్ళు.

1825. వేలం వారి పెళ్ళికొడుకు వ్యారడగ నేరదు ఉన్నదంతా ఊడ్చి పెట్టమన్నట్లు.

1825. వేడుక వెంకటేశ్వరుడిది, గోలగోవిందుడిది.

1826. వేమన్న మాట వెర్రిమాట కాదు.

1827. వేరులో పురుగు పుడితే వృక్షానికే చేటు.

## శ ష స హ ళ క్ష అ

1828 శంఖములో పోస్తే గాని తీర్థంకాదు.

1829 శంఖములో పోస్తే తీర్థం వెంకులో పోస్తే నీళ్ళు.

1830 శరగోపం లేకుంటే నాకంఠం పోయె, ఇంటికి పోయి గంటె బోర్లించుకుంటానన్నాట్ట.

1831. శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు.

1832 శతకోటి లింగాలలో నా బోడి లింగం చూడమన్నట్లు.

1833 శనగలు తిని చేయి కడుక్కున్నట్లు.

1834 శత్రుశేషం, ఋణశేషం, అగ్నిశేషం, రోగశేషం మిగల్చరాదు.

1835 శని పడితే ఏడేళ్ళు, నేను పడితే పద్నాలుగేళ్ళు.

1836 శనేశ్వరుడికి నిద్ర ఎక్కువ, దరిద్రుడికి ఆకలి ఎక్కువ.

1837. శయనే కాదనే తెలిపిన వాడేశాస్త్రకారుడు.

1838. శవానికి చేసిన అలంకారంలాగా.

1839. శ్వాస ఉన్నంత వరకూ ఆశ ఉంటుంది.

1840 శాస్త్రుల వారింట జన్మించి సోమయాజుల ఇంట జొచ్చి లవణ మంటే దూడ రేణమని ఎరగనా అన్నట్లు.

1841 శల్య సారధ్యం.

1842 శింగన్న అద్దంకి పోనూ పొయ్యాడు, రానూ వచ్చాడు.

1843 శింగినాదం, జీలకర్ర.

1844. శిరిపోయినా చిన్నెలు పోలేదు.

1845 శిలాభోగం, స్థలాభోగం, నరభోగం కానరావు.

1846. శిలాశాసనం, ఫలాపాదకం.

1847 శివరాత్రికి చలి శివ శివ అని పోతుంది.

1848 శివుడాజ్ఞలేనిదే చీమైనా కుట్టదు.

1849 శివరాత్రికి జీడిగింజలు ఉగాదికి ఊరగాయ.

1850 శుభం పలకరా పెళ్ళికొడకా అంటే పెళ్ళికూతురు ముండ ఎక్కడవుంది అన్నాట్ట

1851 శుష్కప్రియాలు, శూన్యహస్తాలు

1852 శేరుదొరకు, మణుగు బంటుకు.

1853 శొంఠిలేని కషాయం లేదు.

1854. శ్రీరామరక్ష, నూరేళ్ళు ఆయుష్షు

1855. శ్రీరంగ నీతులు చెప్పేవారె కాని చేసేవారు లేరు.

1856. శ్రుతిమించి రాగాన పడ్డట్లు.

1857. శికాషా లెస్స అంటే గరుడాయ గరుడాయ లెస్స అన్నట్లు

1858. శాంతి శోధిస్తుంది.

1859.శోభనంనాటి ముచ్చట్లు లంఖణం నాడు తలచుకున్నట్లు.

1860.శెట్టిశింగారించేలోగా పట్నమంతా కొల్లబోయింది.

1861.శేరుకు సవాశేరు.

1862.షండున కేలరా సతి భోగం.

1863.షండున కబ్బిన సాన వలె.

1864.శ్యామలా కారుడమ్మా ఈ బిడ్డ శాన్నాళ్ళు బ్రతకడమ్మా.

1865.సంక్రాంతికి చంకలెత్తకుండా చలి.

1866.సంగీతానికి చింతకాయలు రాలుతాయా.

1867.సంత మెరుగు, సాని ఎరుగు.

1868.సంతులేని ఇల్లు చావడి కొట్టం.

1869.సంతోషం సగం బలం.

1870.సందకాడ వచ్చిన మామ, సగం పొద్దున వచ్చిన చుట్టం పోరు.

1871.సందట్లో సడేమియా.

1872.సందట్లో సమారాధన.

1873.సందాయి సందాయి అంటే చిచ్చాయి, చిచ్చాయి అన్నదట.

1874.సంధ్యావందనం చేస్తే పుణ్యం లేదు, చెయ్యకపోతే పాపం పోదు.

1875.సంసారం గుట్టు, వ్యాధి రట్టు.

1876.సంసారి తిరిగి చెడతాడు, సన్యాసి తిరక్క చెడతాడు.

1877.సంసారి దుఃఖి, సన్యాసి సుఖి.

1878.సగం చచ్చి సంగీతం, అంతా చచ్చి హాస్యం.

1879. సగం సాలెనేత, సగం మాల నేత.

1880. సత్రం భోజనం, మఠం నిద్ర.

1881. సద్దెన్నం తిన్నమ్మ మొగుడాకలి ఎరుగదట.

1882. సన్నబియ్యం సాయవవ్వ.

1883. సన్యాసం పుచ్చుకున్నా కావడి బరువు తప్పదట.

1884. సన్యాసి పెళ్ళాం విధవా కాదు, పునిస్త్రీ కాదు.

1885. సన్యాసి పెళ్ళికి 'జుట్టు' దగ్గర నుంచి ఎరువే.

1886. సన్యాసి, సన్యాసి రాచుకుంటే బూడిద రాలిందట.

1887. సన్నెకల్లు దాస్తే పెళ్ళి ఆగుతుందా.

1888. సబా అంటే ఆరునెల్లు.

1889. సమయానికి లేంది చంక నాకనా.

1890. సముద్రమైనా ఈద వచ్చుకాని సంసారం ఈదలేం.

1891. సముద్రంలో కాకిరెట్టలాగా.

1892. సరసం విరసం కొరకే, ధర హెచ్చుట తగ్గుటకొరకే.

1893. సముద్రాన్ని చంకన బెట్టుకొని చెలమకు చెయ్యి చాపినట్లు.

1894. సవాకోటి లింగాలలో నా బోడి జంగం.

1895. సాగితే ఇడవలె, జారితే పడవలె.

1896. సాగితే బండి, సాగకపోతే మొండి.

1897. సాటి వారితో సరిగంగ స్నానాలు.

1898. సాతాని జుట్టుకు, సన్యాసి జంద్యానికి ముడిపెట్టినట్లు.

1899. సానికిచ్చిన సొమ్ము, గోడకు వేసిన సున్నం, చూడ్డానికే తప్ప తిరిగి రావు.

1900.సాని సీతి, సన్యాసి జాతి.

1901.సామెత లేని మాట ఆమెత లేని ఇల్లు.

1902.సాక్షి కాళ్ళు పట్టుకోడం కన్నా వాదికాళ్ళు పట్టుకోవడం మిన్న.

1903.స్థాన బలిమి కాని తన బలిమి కాదయా.

1904.స్నానానికి ముందు సంభావనకు వెనుక పనికిరాదు.

1905.స్వాతి వానకు ముత్యపు చిప్పలాగా.

1906.సిగ్గు పెళ్ళినాడే పోయింది, కాస్త ఉంటే కార్యంతో పోయింది.

1907.సిగ్గే స్త్రీకి సింగారం.

1908.సిద్దప్పలాంటి శిష్యుడు లేడు, బ్రహ్మంగారి లాంటి గురువు లేడు, వేమన లాంటి యోగి లేడు.

1909.సిరిరా మోకాలడ్డినట్లు.

1910.శివమెత్తిన గంగిరెద్దులా చిందులు తొక్కినట్లు.

1911.సీత పుట్టుక లంక చేటుకే.

1912.సీతాపతి, రామాపతి, పొద్దున్నే లేస్తే పొట్టేగతి, చివరకు చింకి చాపేగతి.

1913.సున్నకు సున్న, హళ్ళికి హళ్ళి.

1914.సున్నాలో ఉన్నది సూక్ష్మం, సూక్ష్మంలో ఉంది మోక్షం.

1915.సుపుత్రా కొంపపీకరా అన్నట్టు.

1916.సుబ్బి పెళ్ళి వెంకి చావుకొచ్చింది.

1917.సూదికోసం సోదికి పోతే కుంచెడు బియ్యం కుక్క ముట్టింది.

1918.సూదిలావచ్చి దబ్బనంలా తేలినట్లు.

1919. సైంధవుడు అడ్డు పడినట్లు
1920. సొమ్మొకడిది, సోకొకడిది.
1921. సోదికి పోతే సుద్దులకు కొదవా.
1922. సకల గుణాభిరాముడు.
1923. సముద్రానికి ఏతం వేసినట్లు.
1924. సుగ్రీవాజ్ఞ.
1925. సున్నం పుట్టని ఊళ్ళో అన్నం పుట్టునా.
1926. సూర్యోదయాన కూర్చుండి శుక్రోదయాన లేచినట్లు.
1927. సొమ్ము పోయి దిమ్మ పట్టింది.
1928. స్తన శల్య పరీక్ష.
1929. స్వర్గానికి బెత్తెడు ఎడం.
1930. స్వర్గానికి నిచ్చెనలు వేసినట్లు.
1931. శృతి మించి రాగాన పడినట్లు.
1932. సంతన లేని ఇల్లు సావడి లేని కొట్టం.
1933. సంపదలో మరుపులు, ఆపదలో అరుపులు.
1934. సగం పెట్టి మేనత్త అన్నట్లు.
1935. సర్వేజనాః సుఖినో భవంతు.
1936. సాగితే నియోగం, సాగక పోతే చచ్చేయోగం.
1937. సాగితే బొంకు, సాగకపోతే రంకు.
1938. సానుల్లో సంసారి, సంసారుల్లో సాని.
1939. సాయిబు సంపాదన ఓటీ కుట్టు పోగులకే సరి.

1940. సాయిబూ, సాయిబూ చిక్కిపోయినావేమంటే ఇంకా చిక్కుతాం, ఇంకా చిక్కుతాం, మనసు వస్తే చచ్చిపోతాం, నీకేమిటి అన్నాట్ట.

1941. సిగ్గు చిన్ననాడే పోయె, పరువు పందిట్లో పోయె కొరవ, సరవా ఉంటే గదిలో పోయె.

1942. సుతులు లేని వారికి గతులు లేవు.

1943. సెంటు భూమి లేనివాడికి సెంటువాసన ఎందుకన్నట్లు.

1944. సెగలేనిదే పొగరాదు.

1945 స్థంభం చాటుగాడొకడు, అదే పోతగాడు ఒకడు, పోతే రాని వాడు మరొకడు.

1946. హనుమంతుడి ముందు కుప్పిగంతులా.

1947. హరిశ్చంద్రుడి నోటు అబద్ధం రాదు, నానోట నిజం రాదు.

1948. హస్త కార్తెలో చల్లితే అక్షింతలకైనా కావు.

1949. హస్తకు ఆది పంట, చిత్తకు చివరి పంట.

1950. హస్త ఆదివారం కొస్తే చచ్చేటంత వాన.

## పరిశిష్ట

1951. ఒక నాడు ధారణ, ఒకనాడు పారణయు.

1952. కంఠగత ప్రాణం.

1953. కండకు లేని దురద చేమకెందుకు.

1954. కలబందకు ఎండు, కోడలికి కొత్త లేదు.

1955. కల్పవృక్షం క్రింద గచ్చపొద ఉన్నట్లు.

1956.కాకి ముక్కుకు దొండపండులాగా.

1957.కాగల కార్యం గంధర్వులు తీర్చినట్లు.

1958.కాచిన చెట్లకే రాళ్ళ దెబ్బలు.

1959.కాలే కడుపుకు గంజే పానకం.

1960.కుంటికులాసం ఇంటికి మోసం.

1961.కుడవబోతూ కుర్రాకు రుచి అడిగినట్లు.

1962.అడుసు తొక్కనేల, కాలు కడుగనేల.

1963.అన్నపు చొరవేకాని అక్షరపు చొరవలేదు.

1964.తెలివిగల వాడికి మూడుచోట్ల అంటిందట.

1965.ఆకాశ రామన్న.

1966.దారిన పొయ్యే దానయ్య.

1967.ఇస్తే చెడేది లేదు, చస్తే వచ్చేదీ లేదు.

1968.ఉంటే ఊరు, పోతే పాడు.

1969.ఉన్నమాటంటే ఉలుకెక్కువ.

1970.ఏలడానికి ఊళ్ళులేక పోయినా ఎత్తుకు తినడానికి ఊళ్ళు లేక పోతాయా.

1971.ఏనుగు చచ్చినా బ్రతికినా వెయ్యివరహాలే.

1972.క్షేత్రమెరిగి విత్తనం పాత్రమెరిగి దానం.

1973.ధైర్యే, సాహసే లక్ష్మి.

1974.లంఖణం పరమౌషధం.

1975.గతజలసేతు బంధనం.

1976.లోకో భిన్న రుచిః.

1977.కష్టే ఫలి.

1978.సూదేటుగాణ్ణి, సుత్తేటుగాణ్ణి, కండేటుగాణ్ణి నమ్మకూడదు.

1979.స్వకార్య దురంధరుడు, స్వామికార్య వంచకుడు.

1980.సుఖాలు కష్టాల కోసమే.

1981.సర్వంకష ప్రజ్ఞ కలవాడు.

1982.సత్యమే జయం.

1983.సకల శాస్త్రాలు, నిలబడి మూత్రాలు.

1984.స్వయం రాజా, స్వయం మంత్రి.

1985.సౌందర్యానికి ఒంటె, సంగీతానికి గాడిద.

1986.హద్దులో ఉంటే ఆడది, హద్దు మీరితే గాడిద.

1987.అరచి గీపెట్టినా.

1988.అడవి కాచిన వెన్నెల.

1989.ఆగ్రహాన అనపెట్టుకున్నట్లు.

1990.ఆ తండ్రి కొడుకు కాడా.

1991.ఉన్న మాటంటే ఊరు అచ్చిరాదు.

1992.ఊరందరిదీ ఒక దోవైతే ఉలిపి కట్టెదొకదోవ.

1993.ఊరంతా ఉల్లి, నీవెందుకే తల్లీ.

1994.ఊక దంపుడు కబుర్లు.

1995.కాశికి పోయి గాడిద గుడ్డు తెచ్చినట్లు.

1996.తాతకు దగ్గులు నేర్పినట్లు.

1997.అక్షయపాత్ర.

1998. అగస్త్యభ్రాత.

1999. అజగరోపవాసం.

2000. కంచిగరుడ సేవ.

2001. ఊర్మిళ నిద్ర.

2002. కబంధహస్తం.

2003. కుంభకోణం.

2004. కందాల రాజు.

2005. పద్మవ్యూహం.

2006. ఉత్తరకుమారప్రజ్ఞలు.

2007. సత్యహరిశ్చంద్రుడు.

2008. నక్షత్రకుడిలా వెంటపడ్డాడు.

2009. శనిగ్రహం.

2010. భరద్వాజ విందు.

2011. దానకర్ణుడు.

2012. కర్ణుడులేని భారతం.

2013. త్రిశంకు స్వర్గం.

2014. భగీరథ ప్రయత్నం.

2015. సర్వం జగన్నాథం.

2016. సర్వం కర్మాధనం.

2017. మొండి శిఖండి.

2018. కుంభకర్ణుడి నిద్ర.

2019. రామరావణ యుద్ధం.

2020. ఉడుతాభక్తి.

2021. శకుని.

2022. దుష్టచతుష్టయం.

2023. బకాసురుడు.

2024. చేతిచమురు భాగోతం.

2025. దైవాధీనం జగత్సర్వం.

2026. ఇసుక తక్కెడ-పేడ తక్కెడ

2027. గుడిపూడి జంగాలు.

2028. పుల్లయ్య వేమవరం.

2029. పెరవలమానుకోరు.

2030. తుని తగువు.

2031. మక్కికిమక్కి.

2032. కాకిగోల.

2033. పాముకు బదనిక చూపినట్లు.

2034. నందోరాజా భవిష్యతి.

2035. అంతా కంత.

2036. నాగవల్లి విమ్మారం.

2037. అలకపాన్పు.

2038. బాదరాయణ సంబంధం.

2039. బ్రహ్మాస్త్రం.

2040. తూ.చ. తప్పక.

2041. చుక్కెదురు.

2042. సుష్టాష్టమం.

2043. ఒజ్జల పుచ్చకాయ.

2044. గుంట ఓనమాలు.

2045. గోడపెట్టు-చెంపపెట్టు.

2046. కంచి గరుడసేవ.

2047. ఏటిదరిమాకు.

2048. యక్షప్రశ్నలు అక్ష హృదయం.

2049. చిదంబర రహస్యం.

2050. తంబళ అనుమానం-తలతిక్క.

2051. తుని తగవు.

2052. తీతువు పిట్ట రాయబారం.

2053. ఇక్ష్వాకుని కాలం.

2054. అస్ఖలిత బ్రహ్మచారి.

2055. మెచ్చి మేకతోలుకప్పు.

2056. ఈనినపులి.

2057. ఉట్టికట్టుకుని ఊరేగు.

2058. తిలా పాపం, తలా పిడికెడు.

2059. తోసిరాజు.

2060. తెలిచిరాజు.

2061. కుచేల సంతానం.

2062. అంతా మనమంచికే.

2063. కాలనేమి జపం.

2064. కొంగజపం.

2065. నాస్తినారాయణమ్మ.

2066. వేలువాయి వేదాంతం.

2067. టెంకాయ కచ్చికొండ.

2068. కప్పల తక్కెడ.

2069. ఆటు-పోటు.

2070. వజ్రాయుధం.

2071. గౌతముడి గోవు.

2072. అంగడిబొమ్మ గొంగడి గొన్నట్లు.

2073. అంగడి వీధిలో అబ్బా అంటే ఎవడికి పుట్టావురా కొడకా అన్నట్లు.

2074. అండలుంటే కొండలు దాటవచ్చు.

2075. అంతకు తగిన గంత, గంతకు తగిన బొంత.

2076. అంతం లేని చోటులేదు, ఆదిలేని ఆరంభం లేదు.

2077. అంతా అయిన వాళ్ళే కాని మంచినీళ్ళు పుట్టవు.

2078. అంతా తెలిసిన వాడులేడు. ఏమీ ఎరగని వాడు లేడు.

2079. అంతా మా వాళ్ళేకాని, అన్నానికి రమ్మన్న వారు లేరు.

2080. అంత్య నిష్ఠూరంకన్నా ఆది నిష్ఠూరం మేలు.

2081. అందం చందం లేని మగడు మంచం నిండా ఉన్నట్లు.

2082. అందం ఉంటే ఆయనా, అదృష్టం ఉండొద్దా!

2083. అందరూ శ్రీవైష్ణవులే, బుట్టెడు రొయ్యలు ఏమైనట్లు.

2084. అందితే జుట్టు, అందకుంటే కాళ్ళు.

2085. అండపోయిన అల్లీసాయిబు, పిలవబోయిన పీరుసాయిబు వత్తాలేరు.

2086. అంబలితాగేవాడికి మీసాలు ఎగబట్టే వాడొకడు.

2087. అంభంలో కుంభం ఆదివారంలో సోమవారం.

2088. అకటా వికటపు రాజుకు,అవివేకపు ప్రధాని, చాదస్తపు పరివారం.

2089. అక్కన్న మాదన్నలు అందలం ఎక్కితే, సాటికి సరసపు చెరువుగట్టు ఎక్కాడట.

2090. అగడ్తలో పడ్డ పిల్లికి అదే వైకుంఠమట!

2091. అగ్గి మీద గుగ్గిలం చల్లినట్లు!

2092. అగ్నికి వాయువు తోడైనట్లు.

2093. అచ్చమ్మ పెళ్ళిలో బుచ్చమ్మ శోభనం.

2094. అచ్చివచ్చే కాలానికి నడిచొచ్చే కొడుకు పుట్టాడట.

2095. అచ్చుపోసిన ఆబోతులాగా!

2096. అటునుంచి ఇటు నరుక్కు రమ్మన్నారు!

2097. అట్టుపెట్టినమ్మకు అట్టున్నర!

2098. అడిగితే చిరాకు, అడక్కపోతే పరాకు.

2099. అడుక్కుతినేవాడికి ఆలు అయ్యేకన్నా భాగ్యవంతుడికి బానిస అయింది మేలు!

2100. అణిగి మణిగి ఆకులో పిందెలాగ.

2101. అతి రహస్యం బట్ట బయలు.

2102. అతుకుల బొంత, గతుకుల బాట!

2103. అత్తముండ కన్న ఉత్తముండ మేలు.

2104. అత్తలేని కోడలుత్తమురాలు, కోడలులేని అత్త గుణవంతురాలు!

2105. అదిగో పులి అంటే, ఇదిగో తోక అన్నట్లు.

2106. అదృష్టం చెప్పిరాదు, దురదృష్టం చెప్పి పోదు.

2107. అదృష్టవంతుణ్ణి చెడగొట్టేవాడు, దురదృష్టవంతుణ్ణి బాగుప

రిచే వారు లేరు!

2108.అనిత్యాని శరీరాని, అందరి సొమ్ము మనకేరాని!

2109.అనుమానం ప్రాణ సంకటం.

2110.అనుమానం ముందుపుట్టి ఆడది తర్వాత పుట్టిందట.

2111.అనుమానం మొగుడు ఆలిని వీపుకు కట్టుకుంటే పెళ్ళాం ముండ మొగుణ్ణి కొప్పులో పెట్టుకుందట.

2112.అనుములు తింటూ మినుములు పెట్టినట్లు.

2113.అనువుగాని చోట అధికుల మనరాదు.

2114.అనూరాధలో తడిస్తే ఆడది మొగవాడవుతాడట.

2115.అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్య సన్నిధీ, అనాచార భయం నాస్తి తిప్పన్మాత్రస్య సన్నిధౌ.

2116.అప్పుచేసి పప్పు కూడు.

2117.అప్పులున్న వాడి వెంట, చెప్పులున్న వాడి వెంట పోకూడదు.

2118.అప్పులేకపోతే ఉప్పు గంజైన మేలే.

2118.అప్పులేని మనిషి పిప్పిలేని పగడం ఉందునా.

2119.అబద్ధమాడితే అన్నంపుట్టదు, నిజం చెపితే నీళ్ళు పుట్టవు.

2120.అబద్ధమాడినా గోడ పెట్టినట్లుండాలి.

2121.అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడతారు.

2122.అభాగ్యుడికి ఆకలెక్కువ, నిర్భాగ్యుడికి నిద్ర ఎక్కువ.

2123.అమావాస్యకు అట్లు, పున్నానికి బూరెలు.

2124.అమ్మ గూటికి, అయ్య కాటికి.

2125.అమ్మాయి పుట్టిందంటే ఆయువు సగం మింగినట్లే.

2126.అయిందమ్మా పెళ్ళి అణిగేనమ్మా రంధి.

2127.అయితే ఆతుకూరు లేకపోతే పోలేపల్లి.

2128. అయిపోయిన పెళ్ళికి మేళమెందుకు.

2129. అయుష్షు గట్టిదైతే అడివిలో ఉన్నా, అయోధ్యలో ఉన్నా ఒకటే.

2130. అయ్యకు విద్యాలేదు, అమ్మకు గర్వంలేదు.

2131. అయ్యవార్లవారి నట్టిల్లు లాగా.

2132. అరచేతిలో వైకుంఠం చూపినట్లు.

2133. అరటిపండొలిచి చేతిలో పెట్టినట్లు.

2134. అరవ చెరుచు, పాము కరుచు.

2135. అరిష్టానికి అంగారకుడు, పాపానికి భైరవుడు.

2136. అర్ధరాత్రి వేళ మద్దెల దరువు.

2137. అల్పుడెపుడు పలుకు ఆడంబరము గాను.

2138. అల్లుడికి అత్తాశ, బాపడికి పప్పాశ, గొడ్డుకు దూడాశ.

2139. అల్లుడికి బెట్టు, ఇల్లాలికి గుట్టు ఉండాలి.

2140. ఆ ఇంటికి దడీలేదు, ఈ ఇంటికి గడియలేదు.

2141. ఆ ఊరికి ఈ ఊరు ఎంత దూరమో. ఈ ఊరికి ఆఊరు అంతే దూరం.

2142. ఆటాపాటా మాఇంట మాపటి భోజనం మీఇంట.

2143. ఆత్మస్తుతి, పరనింద, అర్థాపేక్ష లేని వాడు మహానుభావుడే.

2144. ఆపదలు కాపలాలుండవు.

2145. ఆమడలు దూరమైతే అంతఃకరణాలు దూరమవుతాయా.

2146. ఆముదపు విత్తులు ఆణిముత్యాలవుతాయా.

2147. ఆముదాల బేరం, కామెర్ల రోగం నమ్మరాదు.

2148. ఆరంభ శూరుడికి ఆర్భాటమెక్కువ.

2149. ఆవాహన లేదు, విసర్జన లేదు.

2150.ఆవు తొలిచూలు, గేదె మలిచూలు.

2151.ఆవలిస్తే పేగులు లెక్కపెట్టినట్లు.

2152.ఆశ ఆలిమీద పడక చాప మీద.

2153.ఇంట గెలిచి రచ్చ గెలువు.

2154.ఇంటింట ఇటుక పొయ్యి మాఇంట మట్టి పొయ్యి.

2155.ఇంటిగుట్టు లంకకు చేటు.

2156.ఇంటిపేరు కస్తూరివారు, ఇంట్లో గబ్బిలాల కంపు.

2157.ఇంట్లో ఇల్లాలి పోరు, బయట బాకీల పోరు.

2158.ఇంత బతుకూ బతికి ఇంటి వెనకాల చచ్చినట్లు.

2159.ఇక్కడ మునిగి అక్కడ తేలేవాడు.

2160.ఇచ్చిన వాడు దాత, ఇవ్వని వాడు రోత.

2161.ఇరుగు ఇంగలం పొరుగు మంగలం.

2162.ఇత్తి కొమ్ము అంటె, బత్తి కొమ్ము అన్నట్లు.

2163.ఇష్టమైన వస్తువు ఇంగువతో సమానం.

2164.ఈదాడంటే కోదాడన్నట్లు.

2165.ఈనగాచి నక్కల పాలైనట్లు.

2166.ఉంటే ఊరు, పోతే పాడు.

2167.ఉచ్చగుంటలో చేపలు పట్టినట్లు.

2168.ఉద్యోగికి దూర భూమి లేదు.

2169.ఉన్న ఊరు కన్నతల్లి లాంటిది.

2170.ఉన్నది పోదు, లేనిది రాదు.

2171.ఊళ్ళో వియ్యం కయ్యముల పాలు.

2172.ఊరి ముందరి చేను కాకుల్ల పాలు.

2173.ఊసరక్షేత్రంలో దూసరి తీగ.

2174. ఊసరవెల్లిలా రంగులు మార్చేవాడు.
2175. ఎంత చెట్టుకు అంత గాలి.
2176. ఎంత వారైనా కాంత దాసులే.
2177. ఎడ్డిమంటే తెడ్డెమన్నట్లు.
2178. ఎద్దు పుండు కాకికి ముద్దా.
2179. ఎనుబోతు మీద వాన కురిసినట్లు.
2180. ఏ గాని ముండకు డబ్బున్నర క్షవరం.
2181. ఏ గూటి చిలక్కు ఆ గూటి పలుకు.
2182. ఏ చెట్టూ లేని చోట ఆముదపు చెట్టే మహావృక్షం.
2183. ఏ ఎండకా గొడుగు పట్టినట్లు.
2184. ఏ రాయి అయితేనేం పళ్ళూడగొట్టు కోవడానికి.
2185. ఏరుముందా, ఏకాదశి ముందా, ఏరువాక పున్నమి ముందా.
2186. తీగలాగితే, డొంకంతా కదిలినట్లు.
2187. ఒళ్ళు వంగనమ్మ కాలిమెట్టెలకు కందిపోయిందట.
2188. కంచం పొత్తేగాని మంచం పొత్తు లేదు.
2189. ఈ కంటికి ఈ రెప్పలడ్డమా.
2190. కట్టిన ఇల్లు, పెట్టిన పొయ్యి.
2191. అది కడుపా, చెరువా.
2192. కడుపు కాలి ఏడుస్తుంటే మనోవర్తి ఏమిస్తావన్నదట.
2193. కడుపుచించు కుంటే కాళ్ళ మీద పడుతుంది.
2194. కడుపులో చల్ల కదల కుండా.
2195. కనుముకు కాకర, భోగికి పొట్ల.
2196. కనుమునాడు కాకైనా బయల్దేరదు.
2197. కాకులను కొట్టి గద్దలకు వేసినట్లు.

2198.కాదు కాదు అంటే నాది నాది అన్నాట్ట.

2199.కాపుల జాతకాలు కరణాల కెరుక.

2200.కాలికి చుట్టుకున్న పాము కరవక మానదు.

2201.కాలు తొక్కిన వేళ, కంకణం కట్టిన వేళ మంచిది కావాలి.

2202.కింద పడ్డా పై చేయి నాదే అన్నట్లు.

2203.కుక్కలు చింపిన విస్తరిలాగా.

2204.కుందేటి కొమ్ము సాధించినట్లు.

2205.కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదినట్లు.

2206.కులట బిడ్డ కొడుకవుతాడా, మెరుపుతీగ దీపమవుతుందా.

2207.కులం తప్పిన వాడుబంతికి ముందు, కూరగాయల వాడు సంతకు ముందు.

2208.కృష్ణా స్నానానికి కొండు భొట్ల ఆజ్ఞ.

2209.గంగా స్నానం తుంగా పానం.

2210.గాలికి పుట్టి ధూళికి పెరిగినట్లు.

2211.గుట్టు చప్పుడు కాకుండా.

2212.గుడ్డెద్దు చేలో పడ్డట్లు.

2213.గుడ్డికన్నా మెల్ల మేలు.

2214.గుడ్డి కన్ను తెరిచినా ఒకటే మూసినా ఒకటే.

2215.కలగూర గంప.

2216.గోడమీది పిల్లి వాటం.

2217.గుండెల మీద కుంపటి.

2218.గోప్రదక్షిణం భూ ప్రదక్షిణ మంత ఫలమిచ్చినట్లు.

2219.గోముఖ వ్యాఘ్రం.

2220.ఘటాలెన్నైనా గగన మొకటే.

2221. ఘోటక బ్రహ్మచారి.

2222. చచ్చే కాలానికి సత్యభామ వేషమేసినట్లు.

2223. చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష.

2224. చిలుము వదిలితే గాని చిద్ర మొదలదు.

2225. చీకట్లో చిందులాట.

2226. చీమలు పెట్టిన పుట్టలు పాముల కిరవైనయట్లు.

2227. చెడ్డావడ్డా చేబ్రోలే (శ్రీకాకుళమే) గతి.

2228. చెప్పడం సులభం చేయడం కష్టం.

2229. చెప్పుతో కొట్టి శఠగోపం పెట్టినట్లు.

2230. చెప్పులోని రాయి, చెవిలోని జోరీగ, ఇంటిలోని పోరు ఇంతింత కాదయా.

2231. చెరపకురా చెడేవు.

2232. చేట భారతం.

2233. చేటు కాలానికి చెడ్డ బుద్ధులు.

2234. చేసిన పాపం చెపితే పోతుంది.

2235. చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ.

2236. చొప్పదంటు ప్రశ్నలు.

2237. తంగేటి జున్ను.

2238. తంగేడు పూసినట్లు.

2239. తలప్రాణం తోక కొచ్చినట్లు.

2240. తల్లికి బొల్లి ఉంటే పిల్లకు చుక్కైనా ఉంటుంది.

2241. కుక్క ముూతి పిందెలు.

2242. తల్లిదైవం, తండ్రి ధనం.

2243. తాను తవ్వుకున్న గోతిలో తానేపడ్డట్లు.

2244.తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్లు.

2245.తాత బొచ్చె తరతరాలు.

2246.తిమ్మన్న బంతికి రమ్మన్నారు కాబోలు.

2247.తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మిని చేసినట్లు.

2248.తుమ్మితే ఊడిపోయే ముక్కు.

2249.తురక మరక తిరగేసి నరక.

2250.బీరకాయ పీచు.

2251.దారిన పోయే దానయ్య.

2252.దినదిన గండం నూరేళ్ళాయుష్షు.

2253.దొంగ చేతికి తాళాలిచ్చినట్లు.

2254.దొంగలు దొంగలు కలిసి ఊళ్ళు పంచుకున్నట్లు.

2255.ధర్మానికి పోతే కర్మం చుట్టుకున్నదట.

2256.నట్టేట ముంచినట్లు.

2257.నోట్లో చక్కెర, కడుపులో కత్తెర.

2258.నోట్లో వేలు పెడితే కొరక నేరదు.

2259.పాండవుల వారి సంపాదన దుర్యోధనుల వారి పిండాకూళ్ళకు సరి.

2260.పాచివళ్ళ దాసరికి కూటిమీదే లోకువ.

2261.పాపి చిరాయువు, పుణ్యే గతాయువు.

2262.పీనుగ మీద పిండాకూడన్నట్లు.

2263.వుండు మీద కారం చల్లినట్లు.

2264.వూరి గుడిసెకు చాందిని మంచం కావాలా.

2265.వూలవాసన నారకు పట్టినట్లు.

2266.గూటిలోని రామచిలుక.

2267. పేరు పెద్ద ఊరు దిబ్బ.
2268. పేరులేని వ్యాధికి, పెన్నేరుగడ్డ మందు.
2269. బుధవారం నాడు పురికూడా బయల్దేరదు.
2270. బెండ్లు మునిగి గుండ్లు తేలినట్లు.
2271. బ్రహ్మచారి శతమర్కటః.
2272. బ్రహ్మకైనా పుట్టు రిమ్మ తెగులు.
2273. భోజనానికి వచ్చి గొయ్యి త్రవ్వినట్లు.
2274. భోజనానికి వద్దంటే పట్టుచీర కట్టుకొస్తానన్నట్లు.
2275. మంగలంలోని పేలాలలాగా.
2276. మనిషి కాటుకు మందులేదు.
2277. మనోవ్యాధికి మందులేదు.
2278. మాచకమ్మకు ముత్యాల సరమేల.
2279. కడివెడంత గుమ్మడి కాయ కత్తిపీటకు లోకువ.
2280. మిడతం భొట్లు జోస్యంలాగా.
2281. మిన్ను విరిగి మీద పడ్డట్లు.
2282. మీకు మాట, మాకు మూట.
2283. మీన మేషాలు లెక్క పెట్టినట్లు.
2284. ముండమొయ్యవచ్చుగాని నిందమొయ్యరాదు.
2285. ముందరి కాళ్ళకు బంధాలు.
2286. బాదరబందిరి.
2287. ముక్కేదిరా అంటే తలతిప్పి చూపించాడట.
2288. ములక్కాయకు ముళ్ళెన్ని అంటే కాకరకాయకు కళ్ళెన్ని అన్నట్లు.
2289. ముష్టిలో ముష్టి ధర్మ ముష్టి.

2290. [illegible] [illegible] పెళ్ళాం.

2291. బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా పనికి రాదు.

2292. మెత్తని వాణ్ణి చూస్తే మొత్త బుద్ధి అవుతుందట.

2293. మెచ్చి మేక తోలు కప్పినట్లు.

2294. మొలబంటి దుఃఖంలో మోకాలి బంటి సంతోషం.

2295. యుగ యుగాల నాటి యుధిష్ఠిరుడిలాగా.

2296. రాళ్ళన్నీ ఒకచోట రత్నాలన్నీ ఒకచోట.

2297. రాత ముడిచినా చావులేదు.

2298. రామా వచ్చే, పోమే పోయే రాగులు విసరి సంకటి చేయ మన్నాట్ట.

2299. రెడ్లున్న ఊళ్ళో, రేచులున్న కొండలో ఏమీ బ్రతికేవు.

2300. రెప్పలార్చేవారు కొంపలార్పుతారు. కళ్ళార్పే అమ్మ ఇల్లార్పుతుంది.

2301. రేపుమాపు తురకేపాకు.

2302. రాయి గుద్దనేల, చెయ్యి నొవ్వనేల.

2303. రాళ్ళు తిని రాళ్ళు అరిగించుకుంటాడు.

2304. రెక్కాడితే గాని డొక్కాడదు.

2305. లాకేత్యము, దాకు కొమ్ము ఇవ్వని వాడు.

2306. లోభికి ఖర్చెక్కువ.

2307. రాజు వలచిన రంభ, రాజు విడచిన తుంబ.

2308. రాతి బొమ్మకు చక్కిలి గింతలు పెట్టినట్లు.

2309. రుచి మరిగిన పిల్లి ఉట్టిమీద కెక్కినట్లు.

2310. రొట్టె విరిగి నేతిలో పడ్డట్లు.

2311. వంకాయ దొంగిలించిన వాడు టెంకాయదాకా రాడా.

2312. వనం విడిచిన పక్షి, జనం విడిచిన మనిషి.

2313. వాళ్ళు పిల్ల నివ్వనన్నారు, నేను చేసుకోనన్నాను.

2314. వీరభోగ వసంత రాయలు.

2315. వెంట రావద్దంటే ఎత్తుకోమని ఏడ్చాడట.

2316. వెర్రి వెయ్యకు తొర్రి వెయ్యి తోడు.

2317. వెలమలున్న ఊరు కొంగలున్న మట్టి ఒకటే.

2318. శాస్త్రానికి అంటులేదు. యజ్ఞానికి ఎంగిలి లేదు.

2319. బంగారమంటి కోమటి సంగీతము మరిగి బేరసారము ఒడి
గెన్.

2320. సిగ్గుబోయేవేళ చీరలబ్బినట్లు.

2321. సూరన్న చిన్నవాడు, పేరన్న పెద్దవాడు, అయ్యకెత్తరా
కోళ్ళగంప.

2322. సోమారికి సోకులెక్కువ.

2323. హీనస్వరం పెళ్ళాం ఇంటికి చేటు.

2324. క్షణం చిత్తం క్షణం మాయ అన్నట్లు.

2325. క్షేమంగా పోయి లాభంగా రమ్మన్నట్లు.

2326. అత్త బుద్ధి కోడలు బుద్ధి ఒకటవుతాయా?

2327. అత్త అవున్నదీ లేదు కోడలు కాదన్నాదీ లేదు!

2328. అత్తను అమ్ముకోమన్నారు కోడల్ని కొనుక్కోమన్నారు

2329. అత్తా అత్తా ఎప్పుడు నిద్రపోతావంటే నిన్ను చూసిపోతా
అందట

2330. అత్తను ఏడిపించిన కోడలు అత్త అయితే బలేగుందట

2331. అత్త చచ్చిందని అత్త చీరకట్టుకుంటే చచ్చినాక దయ్యమ
యిపట్టిందట.

2332. అన్నీ తెలిసిన అత్త అమావాస్యనాడు చచ్చిందట.

2333. అత్త ఆడమంది కోడలు కుంటమంది.
2334. అత్తతనంలో మంచి తనం ఆడంగిలో మగతనం వుంటాయా?
2335. అత్తా అత్తా రోకలి ఎత్తమంటే అమావాసరానీమందట
2336. అత్తకి అట్లతద్ది సరదా! కోడలికి కోటప్పకొండ సరదా
2337. అడవిలో వెన్నెల - సముద్రంలో వాన ఒకటే
2338. అమ్ముకో అమ్ముకో అంటే కొనుక్కో కొనుక్కో అన్నట్టు
2339. అడుసులో హంస ఆడింది. అడవిలో అమ్మపాడింది ఒకటే!
2340. అండలుంటే కొండలు దాటచ్చు.
2341. ఆడండి ఆడండి అంటే పాడండి పాడండి అన్నారట.
2342. అందని ద్రాక్షలు పుల్లనన్నట్లు
2343. అంబలి దాగే వాడికి మీసాలెగరేసినట్లు
2344. అసలే కోతి అద్దం చూపిస్తే వూరుకుంటుందా?
2345. ఆలస్యం చేస్తే అమృతం విషమవుతుందట?
2346. అనువయిన భూమి అరచేయంత చాలు
2347. ఆడలేని అమ్మాయిలు మద్దెల ఓటిదన్నారట
2348. ఆడదయిపుట్టేకంటే అడవిలోమానయి పుట్టటం మేలు
2349. ఆస్తిపంపకంతో చావులు, అయ్య చావుతో విందులు
2350. అప్పిగా చెప్పలెక్కడరా అంటే ఆకాశాన కనపడలేదన్నాట్ట
2351. ఆకాశవీధిలో కొంగలు, అంగడి వీధిలో దొంగలు
2352. అగ్గిని మండించవచ్చు గాని మూర్ఖుణ్ణి మార్చలేమట!
2353. అడవిలో చెట్టుకాయ ఊరిలో ఉప్పురాయి కలిస్తే ఊరగాయ
2354. అత్త పగలగొడితే పాత కుండ కోడలు పగలగొడితే కొత్త కుండ
2355. అత్తదానం స్వర్గానికి కోడలి దానం నరకానికి

2356. అత్తను చూసి దాచుకోవడం, పిల్లని చూసి పారేసుకోవడం.

2357. అప్పు ఆరాటమే గాని బావ బతికే లక్షణం కనపడలేదట.

2358. అన్నీ తెలిసినవాడు అమావాస్య నాడుచస్తే, ఏమీ తెలియని వాడు ఏకాశి నాడు చచ్చాట్ట

2359. ఆడదాని అబద్ధం గోడ కట్టినట్టు వుందట

2360. అమావాస్య నాడు అట్టు పెట్టాను పున్నమి నాడు పూర్ణాలు పెట్టాను. నాగులచవితికి నాకేం పెడతవన్నట్లు

2361. అరచేతిలో వైకుంఠం కలత నిద్రలో కైలాసం

2362. అత్తగారి ఆరళ్ళు కోడలి గారి వేవిళ్ళు.

2363. అంట్లుతోమవే అంకాక్షి అంటే అత్తరు రాసుకోనీవే కుంకాక్షి అందట.

2364. అత్తా అత్తా అన్నం పెట్టత్తా అంటే సున్నంపెడతానే అందట.

2365. అరువు బేరంవాడు ఆత్మీయులు వసూలునాడు బూతులు

2366. అక్కరకు రాని చుట్టము అక్కరలేదు. మొక్కితే వరమీని దేవుడ క్కరలేదు.

2367. ఆరు దుక్కుల వర్షం కురిస్తే ఆరువేల కప్పలు అరుస్తాయట

2368. అంచుల అందాలు చూసి అందరూ మోసాల పాలయినట్టు

2369. అన్నదమ్ముల కలహం - బావ మరుదుల సరసం

2370. ఆకు కందక పోకకు పొందక ఏమవుతుంది?

2371. అడ్డం తప్పకో అంటే గడ్డం పట్టుకో అన్నట్టు

2372. అమ్మా తల్లి అంటే అప్పాలన్నీతినే సిందట

2373. అరికాలి ముల్లు అరచేతి పుండు

2374. అరవబోకే చెల్లీ అంటే కరవబోకే అక్కా అన్నదట

2375. ఆరుద్రలో వర్షం అమృతంతో సమానం

2376. అరుంధతి కనపడలేదంటే అరువేలప్పు కనిపించిందా అన్నట్టు

2377. అబ్బడి నెత్తిన సుబ్బడు కొడితే సుబ్బడి నెత్తి సూరీడు కొట్టాడట

2378. ఆ వూరివారు ఈ వూరికి రారంటే ఈ వూరివారు ఆ వూరు పోరన్నారట.

2379. ఆ ఇంటి కాకి ఈ ఇంటి మీద వాలదు ఈ ఇంటి కాకి ఆ ఇంటి మీద వాలదు

2380. అలిగిన కోడలు, సోలిన అత్త గుట్టుగా వుంటారు.

2381. అరటాకు మీద ముల్లు పడ్డ, ముల్లు మీద అరటాకు పడ్డ అరటాక్కే నష్టం.

2382. ఆలి నోట్లో ఆముదం మొగుడి నోట్లో మినపగింజ

2383. ఆకాశాన వరద గూడు, అత్త గారింట్లో వానగోడు.

2384. అత్తా అత్తా కొడుకును కంటానంటే, వద్దంటానా అందట

2385. ఇల్లు గాలుతున్నది అంటే చుట్టముక్కలు కాల్చు కుంటానన్నట్టు

2386. ఇంటి పేరు ఇంగువ వీధి పేరు గింగువ

2387. ఇంటి దీపం గదా అని ముద్దాడితే కాలకుండా వుంటుందా!

2388. ఇచ్చింది పోయింది అసలు రాదు.

2389. ఇసుకలో తైలం వుండదు - బంకలో బంగారం వుండదు.

2390. ఇల్లరికం వద్దు కొడకా అంటే సన్యాసంవుంటా అన్నట్టు

2391. ఇల్లలికితే పండకవుతుందా? తోరణం కడితే పెళ్ళవుతుందా?

2392. ఇస్తానన్న వాణ్ణి వస్తానన్న దాన్ని నమ్మరాదు.

2393. ఇంట్లో పొయ్యి. చావిట్లో నుయ్యి

2394. ఇల్లు చూస్తే తెలుస్తుంది ఇల్లాలి అందం.

2395. ఇచ్చిన దాతకు ఒక్క దణ్ణం నిలిచిన పీతకు వేయి దణ్ణాలు

2396. ఇనక తక్కెడే ఈ రక్కా అంటే పేడతక్కెడ పేరక్క అందిట

2397. ఇంటిలో పోరు వీధిలో జోరు.

2398. ఇంటిలో ఈరక్క పెరటిలో పేరక్క

2399. ఇంటదానికి ఇత్తడి గొలుసు, బజారుదానికి బంగారు గొలుసు

2400. ఇష్టమయితె ఈపరాలు కష్టమయితే కంపరాలు

2401. ఇదేంటి రా తాడెక్కావంటే ఇదిగిదిగో దూడమేత అన్నాట్ట.

2402. ఈశ్వర ఈశ్వరా ఎన్నాళ్ళు అంటే పూజారిని చూశ్వేదా అన్నాట్ట

2403. ఇంట్లో పిల్లలు, మంచంలో నల్లులు

2404. ఈదిలో ఈరంగం పేటలో పేరంటం.

2405. ఆసుకోలా ఆనుకోలా అంటే పరుగుతీ నావెంటరా అందిట.

2406. కక్కిన కూటికి ఆశపడేరకం

2407. కట్టె వంకర పొయ్యి, కుట్రబుద్ధి కాష్టం తీరుస్తాయి.

2408. కాలితే మచ్చపడుతుంది. కాచితే మెత్తపడుతుంది

2409. కర్ర ఎవడిదో బర్రె వాడిది

2410. కలిగిన వారి పిల్లకు కాలి చెప్పు అరువా?

2411. కలతల మారి కొంప, జగడాల మ్మారి వూరు

2412. కన్నతల్లి కాదన్నా, కట్టుకున్నది కాదన్నా బ్రతుకే వ్యర్థం.

2413. కల్పవృక్షం పెరట్లో, పాదు వాకిట్లో

2414. కత్తికి ఎదురు లేదు. మాటకు తిరుగులేదు.

2415. కదురాడినన్నాళ్ళు కరువుల్లేవు

2416. కదురుకు ఆరాటం పుటితే ఏరాటానా నిలవదు.

2417. కలిగిన నాటి చుట్టాలు, కావాలన్నప్పుడు కనపడరు

2418. సరిపి వచ్చిన సన్నీ వయసొచ్చిన పిల్లా

2419. కష్టసుఖాలు కావడి కుండలవంటివి

2420. కన్నతల్లి అంటే కడుపుచూచేది, కొంటె పిల్ల అంటే కను కొట్టేది

2421. కన్న తల్లికి కంటతడి, చవతితల్లికి కన్నుకుట్టు

2422. కాకి కూసేవి కారుకూతలు, కోకిల కూసేవి కవితలు

2423. కాకి తన్నిందంటే కీడు మూడినట్లు

2424. కాకి తన్నిందంటే పేగు కదులుతుంది.

2425. కాకి చావు కనకమ్మ చావు

2426. కారం రాస్తే మంట, వెన్న రాస్తే తంట,

2427. కలో గంజో దొరికిందే అదృష్టం

2428. కలలో పరమాన్నం ఇలలో గంజినీళ్ళు

2429. కలలో కనిపించింది కోట, ఇలలో దొరికింది గొయ్యి

2430. కల నిజమవుతుందా? కాకి కోకిలవుతుందా!

2431. కాకి గూట్లోకోకిల పిల్ల రెక్కలు రాగానే ఎగిరిపోతుంది.

2432. కాకుల్లో జెముడు కాకి-కూతల్లో కోకిల కూత గొప్ప

2433. కాకులు నూరు కూసిన ఒక కోకిల కూత మేలు

2434. కన్నంలో దొరికిన దొంగ గతి

2435. కన్నం వేసిన దొంగకు తేలు కుట్టినట్లు

2436. కురిస్తే వానై కురవాల, వేస్తే పైరు వేయాల

2437. కుమ్మరికి కుండల కొదవన్నట్లు

2438. కమ్మరి ఇంట్లో బొగ్గులు దొరకనట్లు

2439. కంసాలి పెంచిన గుర్రం చక్క పెళ్ళుతిన్నదట

2440. కాంతాన్ని కనకాన్ని కోరనిదెవరు.

2441. కలిమి వస్తే బలం వస్తుంది. కలిమి పోతే బలం పోతుంది.

2442. కన్నాన బోయి కన్నాన వచ్చేరకం

2443. కాకి చస్తే కాకులు ఎన్నో ఏడుస్తాయి. కానివాడు చస్తే ఏడ్చేవాడుండడు

2444. కులం లేని వాడికి, గుణం లేని వాడికి పిలిచి పిల్లనిస్తారా

2445. కూటికిలోకువయితే, కులానికి లోకువా

2446. కులం కట్టు కలం పట్టు

2447. కరువులో అధిక మాసం లేమిలో అధిక సంతానం

2448. కాధంటే కర్రా బుర్రా నాకు పారేయండి.

2449. కన్నె తనం పోయినా, అన్న మాట పోయినా బ్రతుకే భారం

2450. కన్నె సిగ్గు కనడం కోసం

2451. కాకిలా తిరిగాడు, హంసలా ఈదాడు

2452. కాకులలెక్క కరణాల లెక్క

2453. కల ఫలించిందంటే అదృష్టం మనదే

2454. కలుపు తీయక పోతే పైరుకు చేటు

2455. కష్టే ఫలి అన్నారు పెద్దలు

2456. కాకి తెలుపు, తోలు తెలుపు ఎక్కడన్నా వుందా?

2457. కార్యం గదిలో పెళ్ళికొడుకు అలకట!

2458. కాలి దూరం వేరు కంటి దూరం వేరు

2459. కాలిలో ముల్లు, చెవిలో జోరీగ

2460. కాలికి ఆనె, చెంబుకు చిల్లి,

2461. కంటికి కలక, వంటికి పోటు

2462. కౌగిలించుకుంటే ప్రియురాలు, కసిరి కొడితే కిర్రాలు

2463. కాలికి చుట్టుకున్న పాము కరిచి తీరుతుంది.

2464. కాడు రమ్మంటుంది. ఊరు పొమ్మంటుంది.

2465. కాలు కాలిన పిల్లి, నోరు గాలిన కుక్క

2466. కాలు, చెయ్యి తిన్నగా వున్నంత కాలం మహరాజే

2467. కాలు జారిన పిల్ల బతుకు, నోరు జారిన పెద్ద బతుకు వ్యర్థం

2468. కర్మ తప్పించటం బ్రహ్మాతరం కూడా కాదు.

2469. కమ్మలు నవ్వేవాడుపైన తాళ్ళుపొడిచే వాడు కింద

2470. కల్లు తాగిన కోతిలాగా

2471. కోతికి కొబ్బరి కాయ దొరికినట్టు

2472. కాశీలో కొబ్బరికాయ కాని అన్నట్టు

2473. కాగితంతో పులి, ఏకుల్తో ఏనుగు,

2474. కాశీకి పోయినా శనీశ్వరం వదల్లేదట

2475. కొంప కాలుతోందిరా అంటే నీళ్ళు కాచుకుందాం అన్నాట్ట

2476. కీలు ఎరిగి వాత పెడితే వైద్యం,

2477. కోడల్ని కొట్టినవాడు అత్తని కొట్టలేడా?

2478. కులికేది కోడలు, అరిచేది అత్త

2479. కో అంటే కోటి మంది.

2480. కాకమ్మది కాకి బలగం, కోటయ్యది కోతి బలగం

2481. కోతి కోతి నీ పిల్లలెందరు అంటే ఆకాశంలో చుక్కలన్నీ నాపిల్లలే అందట

2482. కాని కాలంలో కానీ డబ్బు అప్పు పుట్టదు

2483. కార్తెలు మోసం చేస్తే కరువులు వస్తాయి.

2484. కరణం మోసం చేస్తే కొంపలు కూల్తాయి.

2485. కూచమ్మ కూడ బెట్టింది. మాచమ్మ మాయం చేసింది

2486. కుక్క ముట్టె చల్లన, కోతి ముట్టె వెచ్చన

2487. కుక్క తోక పట్టి ఎదురీద మన్నట్టు

2488. కుక్క సింహం కాదు, కుందేలు తోడేలు గాదు

2489. కుక్క పని గాడిద చేస్తే నడ్డి విరిగిందట

2490. కుక్కబుద్ధి దొలిగుంటకు తెలుసు

2491. కుక్క మాసం తినే రకం

2492. కుక్కని కొడితే బుద్ధొస్తుంది. కూలిని కొడితే బుద్ధొస్తుందా

2493. కుక్క దొలిగుంట సామెత

2494. కులం కులం అని కూడు పొగొట్టు కుంటే కులం పిలిచి కూడు పెట్టలేదట.

2495. కూడిందమ్మ గుణం, కుదిరిందమ్మా పెళ్ళి

2496. కోడలికి కొడుకు ముద్దు, అత్తకి అల్లుడు ముద్దు

2497. కుమ్మరి, కంసాలి పాలికి వేసిన పొలం పంటలాగా

2498. కోటి దండాలు పెట్టొచ్చు కోరిక తీరితే

2499. కోటి మొక్కినా మొగుడి బుద్ధి మారలేదట

2500. కుక్కనడిగితే కుంకుమ పెడుతుందా?

2501. కొడుకు మిన్న కోడలు సన్న

2502. కొడుకుల్నికంటానత్తమ్మా అంటే వద్దంటానా కోడలమ్మా అందట

2503. కడుపునింపిన వాడు కొడుకు, కడతేర్చిన వాడు కుంక

2504. కుక్క తెచ్చేవన్నీ బొమికలే.

2505. కుక్కల నక్కల పెళ్ళికి కుందేలు మంత్రాలు చదివిందట

2506. కుంకాక్షి పెళ్ళికి ఏంకాక్షి ఆశీస్సులు

2507. కుందనపు బొమ్మరూపు, కాలభైరవుడుబుద్ధి.

2508. కులం గుణంలేని రంభకన్నా కులం వున్న కోతిమేలు.

2509. కుంటకట్టమీద కుర్చీవేస్తే కూచొని లేచేసరికి కట్ట మింగింది.

2510. కులం తక్కువని కూడెట్టనన్నారట.

2511. కుక్క బదులుగా గాడిద మొరిగిందట.

2512. కోటికి పడగెత్తిన భోగం కొరివి కాలిన రోగం సమానం.

2513. కొండ వెనక అరుపు లేంటి అంటే కోమట్ల రహస్యము అన్నాట్ట.

2514. కొండ కదలదు, కోనసీరు నిలవదు.

2515. కొంప ఏకుతావు రాసుపుత్రా అంటే సందేహమెందుకు నాన్న. అన్నాట్ట.

2516. కొంప తగలడుతున్నది తమ్ముడూ అంటే చలికాచుకుందాం అన్నాట్ట.

2517. కూతురు మీద ప్రేమ కోడలి మీద ఉంటుందా?

2518. కొత్త ఆవకాయ మోజు, కొత్త పెళ్ళాం మోజు.

2519. కొత్త శ్రీమంతుణ్ణోయి బంగారు కత్తితో బరుకు అన్నాట్ట.

2520. కొత్త ఒక వింత పాత ఒక రోత.

2521. కొప్పు వుంటేనేగా పూలుపెట్టుకునేది.

2522. కొప్పులేని సతికి పిలకలేని పంతులు

2523. కోతివుండు బ్రహ్మరాక్షసి, నాలిముచ్చు పుండు రంపరాక్షసి.

2524. కోర్టుకెక్కి ఓడినవాడు కోర్టులో ఏడిస్తే, గెలిచినవాడు ఇంటికొచ్చి ఏడ్చాట్ట.

2525. గంజిలోకి వుప్పులేదు మావా అంటే పాలల్లోకి పంచదార తెమ్మన్నాట్ట.

2526. గచ్చుపొదలాగా గలగలలాడే రకం

2527. గాడితప్పిన బండి వూబిలో దిగిందట.

2528. గాడిదకు గడ్డి ఆవుకు కుడితి.

2529. గాడిద గుడ్డు పెడుతుందా? గద్ద పిల్లని కంటుందా?
2530. గాలిని మూట కట్టువచ్చుగాని గయ్యాళి నోరు కట్టలేము.
2531. గాలిలో మూటరాశాడు నీటిలో మూటకట్టాడు.
2532. గతిలేని వాడికి మతిలేని పెళ్ళాం.
2533. గాడిద సంగీతం ఒంటె అందం.
2534. గుడిని మింగేవాడు, గుడిని, గోపురాన్ని, ధ్వజస్తంభాన్ని మింగేవాడికి తక్కువ.
2535. గుడిలో దేవుడికన్నా గుడి పూజారి ముఖ్యం.
2536. గువ్వ గూడెక్కితే రాజు మేడెక్కాడంట
2537. గొర్రెల గోత్రాలు గొల్లల గోత్రాలు, తోడేళ్లు చూస్తాయి.
2538. గోవులేవిరా గోపన్న అంటే గోదారిలో ఉన్నాయి పాపన్నా
2539. గోరీ దగ్గర పెళ్ళి, గోడ పక్క గర్భాదానం.
2540. గోడపెట్టు చెంపపెట్టు.
2541. చంక నెత్తుకుంటే ముద్దు, నెత్తినెత్తుకుంటే నడమంత్రం.
2542. చచ్చినాడి అందం బతికినోడి బంధం.
2543. చస్తే ఒక ఏడుపు బతికితే బతుకంతా ఏడుపు.
2544. చచ్చినవాడికి పిండివంటలు, బతికినవాడికి బండెడు అప్పులు.
2545. చచ్చేటప్పుడు నారాయణా అనమంటే సీసా అన్నట్టు.
2546. చక్కనమ్మ చిక్కినా చక్కనయ్య సొక్కిన అందం చందం.
2547. చచ్చినవాడి కళ్ళు చారెడేసి అన్నారట.
2548. చదువు కంటే తెలివి - చాకిరేవుకు భానకి తెలుసు
2549. చాపమీద జరిగింది సరసం, పట్టెమంచంమీద జరిగింది ప్రణయం.
2550. చాప సరసంతో సాతాని దంపతులు తెల్లార్చి వున్నట్లు.

2551. చిన్న ఇంట్లో పెద్ద కాపురం.
2552. చిన్నత్త చిన్న పిశాచి పెద్దత్త పెద్ద పిశాచి.
2553. చిల్లర కొట్టు శ్రీమహాలక్ష్మి అన్నట్టు.
2554. చింతచెట్టుకు చిగురొచ్చింది. చిన్నదానికి పొగరొచ్చింది.
2555. చిత్తడి నేల చినుకులు. చిన్నదాని చిందులు.
2556. చిదంబర రహస్యం ఎవరికి తెలుస్తుంది?
2557. చిలక చిలకా పేరు సెప్పు అంటే క్రీ క్రీ అందంట.
2558. చిలకల కొలిక్కి సిగ్గులేదు, చిర్రెత్తిందానికి ఎగ్గులేదు.
2559. చీకటి రహస్యం, వెన్నెల్లో బయట పడింది.
2560. చుట్టంగదాని చూడబోతే దయ్యమై పట్టుకుందట.
2561. చెప్పుతో రాస్తే గాని ధనియాలు జాతి మొలవ ను.
2562. చెప్పేవానికి సిగ్గులేదు, వినేవాడికి ఎగ్గులేదు.
2563. చెరుకు తీపి వెన్ను ఎండితే పోతుంది.
2564. చెరుకు పిప్పికి చీమలు మూగినట్లు.
2565. చూసి మురుసుకుంది. చెప్పి ఏడ్చుకుంది.
2566. చెప్పుడు మాటలు చేటు చక్కని మాటలు పూటు.
2567. చెరువు మీద అలిగితే ఎవరికి నష్టం?
2568. చెవిలో జోరీగా, కాలిలో ముల్లు.
2569. చిత్తులో తాలకరైతే తట్ట తగలెయ్యాలి
2570. చెట్టును బట్టి కాయ - చేనును బట్టి పంట.
2571. చెట్టు క్రింద కులం కూటి దగ్గర బలం
2572. చేతులో పనివుంటే కడుపులో బువ్వుంటుంది.
2573. చేతులో పనివున్న నోటిలో నాలుకుండాలా.
2574. చెయ్యి తిరగ చేసినా చాటనిండా పెట్టరు.

2575. చాకిరేవుకి వెనకపడింది. బంతి కూటికి ఏడిసింది.

2576. జియో జియో అంటే కుయ్యో కుయ్యో అందట.

2577. జగమెరిగిన బ్రాహ్మణుడికి జంధ్యమేల అన్నాట్ట.

2578. జనని పాలు త్రాగి ధరణి నీళ్లు త్రాగి ధన్యుడవాలి

2579. జాతి బుద్ధి జాతిది - కులం బుద్ధి కులానిది

2580. జుట్టుంటే ఏకొప్పయినా పెట్టుకోవచ్చు.

2581. జొన్నగింజ ఊచబియ్యం, వరిగింజ అటుకు బియ్యం

2582. జిల్లేళ్ల సీమలో మల్లెతోట అందమట.

2583. జీడి తింటే జివ్వుమంది గారె తింటే గావుమంది.

2584. జిల్లేడు చెట్టుకు మామిడి కాయాలా?

2585. జంగమాయన తాళం దాసరాయన సంగీతం

2586. జోలె భుజాన వుంటే జగమంతా తిరగవచ్చు.

2587. జానెడు పొట్టకోసం జన్మంత ఆరాటం.

2588. టంగుటూరి మిరియాలు తోకమిరియాలు.

2589. టంగుటంగు మంటుంది కుండ కంగుకంగు మంటుది బిందె

2590. టక్కరి బావకు జిత్తులమరదలి సైగ.

2591. టక్కరి మరదలకు జిత్తులబావ సైగ.

2592. డబ్బు వుంటే ఏడబ్బా వాయించినా ఫరవాలేదు.

2593. డబ్బు లేదంటే తొరగా పొమ్మన్నాట్ట.

2594. డబ్బుగలవాడిది బంగారు వుంగరం డబ్బు లేదంటే ఇత్తడి వుంగరం.

2595. డబ్బులేనివాడి బడాయి చేతగాని బడాయి.

2596. డబ్బుంటే ఢిల్లీ భోగాలు డబ్బు లేకపోక ఎలవడాలు.

2597. డబ్బును చూసి భయంగాని, బుద్ధిచూసిగాదు.

2598. తన్నులాటలూ వద్దు - గుద్దులాటలూ వద్దు.
2599. తలగుడ్డకు తక్కువ గోచిపాతకు ఎక్కువ.
2600. తనతో వచ్చింది తనియాలు, రానన్నది వెల...
2601. తుక్కు తుక్కుగా కోస్తే తట్టకెత్తేస్తా అన్నది.
2602. తనువు చేసింది - మనసు చేసింది మంచిదే అయింది.
2603. తనువిచ్చింది , మనసిచ్చింది - ఇంకేమిుంది ఇవ్వటానికి.
2604. దానిమ్మ చెట్టుకు మడిగుడ్డ కావాలా?
2605. దారినపోయే ధర్మయ్య ధర్మం చెద్దువు రావయ్య.
2606 దారి తెలియని వాడు బాటసారి కాడు.
2607. దాసిదాని కొడుకు అప్పుడు - దానకర్ణుడు యిప్పుడు
2608. నయానభయాన చెప్పాలిగాని నాలుకకోస్తే ఎలా?
2609. నడమంతరపు సిరిగాడు సింహాలబండి అడిగాట్ట.
2610. నల్లరాయిమీద బొగ్గుగీత - తెల్లరాయిమీద సున్నపుగీత.
2611. నంగనాచి నవ్వు నాలుగంధాల చేటు.
2612. నా మొగుడు గిల్లింది నాబుగ్గ - నీ మొగుడు గిల్లింది నీ బుగ్గ
2613. నిప్పుకు చెదలుపట్టింది - నల్లికి తేలు కుట్టింది.
2614. నీళ్ళు పల్లం చూపుతాయి - కన్నీళ్ళు బాధ చూపుతాయి
2615. నీతిలేనిది కోతి, నీతి గలది నాతి
2616. నిజం చెప్పరావమ్మా అంటే కూనకు పిల్లపుట్టింది అన్నట్టు.
2617. నిజం దాచుకోవచ్చు గాని నిప్పు దాచుకోలేము.
2618. నిప్పుల్లో వుప్పేసినట్లుంది నా పని
2619. నీళ్ళు ఎవరు పోసినా అవి పల్లంలోకే పోతాయి
2620. నిజం నిప్పులాంటిది - నీరు తల్లిలాంటిది.

2621. నీరులేని వూరు, దేవుడు లేని వూరు వున్నా ఒకటే లేకున్నా ఒకటే!

2622. నవ్వే నోటిలో ముత్యాలు, ఏడ్చేనోటిలో బొగ్గులు.

2623. నెలబాలునికో నూలుపోగు, పూర్ణచంద్రునికి నమస్కారం.

2624. నోట్లో పిప్పినన్ను - కంట్లో పుసి కండ

2625. నీ ఇల్లు నాయింటి కెంత దూరమో - నా యిల్లు నీ ఇంటికి అంతేదూరము.

2626. నందిని చెయ్యవయ్యా ఆచార్య అంటే పందిని చేసేట్టా.

2627. నక్క పోయిన తరువాత బొక్క పట్టుకుని ఏడ్చాడట.

2628. నక్క జిత్తులు నారదుడి ఎత్తులు.

2629. నట్టేట్లో వేసినా ఎంచి మరీ వెయ్యాలి.

2630. నన్ను నమ్ము నారాయణ అంటే నక్కను నమ్ముతా అన్నాట్ట.

2631. నలుగురు నడిచేది దారి పదుగురు చెప్పేది నీతి.

2632. నరుడు కన్ను పడితే నల్లరాయి బద్దలవుతుంది.

2633. నాతికి వయసొచ్చిందంటే కనీసం కోతి మొగుడన్నా కావాలి.

2634. నాదం లేని గంట నాములేని పంట.

2635. నానాప చేనుగదా అనుకుంటే వుంగడి తగిలిందంట.

2636. కాకిగూట్లో కోయిలగుడ్డు.

2637. నామాల కాకి, విభూది గద్ద, సిద్ధుడి కయివా దొరకవు.

2638. నూరు కాకులు ఓ కోయిలను బతకనిస్తాయా?

2639. నపుంసకుడికి రంభ దొరకదు, గొడ్రాలికి సంతానుండదు.

2640. నామాలు పెట్టేవంత మాత్రనే చావు బుద్ధులు పోతాయా?

2641. నెమలిని చూచిన కాకి పింఛం పెట్టుకుంటుందట.

2642. నత్తనడక, తాబేలు పరుగు.

2643. నోరు గలవాడిదే రాజ్యం కర్రగలవాడిదే బర్రె.

2644. నిప్పు నెవరన్న గుడ్డను కట్టుకుంటారా?

2645. నీ ముఖాన పొద్దు పొడిస్తే - నాయింట కనకం గురుస్తుందన్నాట.

2646. పంచాంగం పోయిందని తిధివారాలు పోతాయా?

2647. పండ్ల చెట్టు కాసేవాడికే ఆ దెబ్బలు తప్పవు.

2648. పంది మెచ్చేది బురద - పడతి మెచ్చేది పన్నీరు.

2649. పందిరి మంచంమీద పడుకున్న నే పందిరి గుంజా పనిచెయ్యి అన్నాట్ట.

2650. పచ్చగడ్డికి నీళ్లు ఆగుతాయా?

2651. పదిరోజులు వస్తున్న వాడింటికి మూడురోజులు వస్తున్నవాడు వెళ్ళాడట

2652. పడమర మెరిసింది - ఉత్తరం ఉరిమింది పిడుగులు పడ్డాయీ అన్నాట్ట.

2653. పానకంలో పుడక - వడపప్పులో గరిక

2654. పట్టెవర్ధనం పెట్టేను పాదపూజ చేయమన్నాట్ట.

2655. పట్టెడన్నం కావాలిగాని గంపెడు గడ్డెందుకు?

2656. పిల్లను చూచి చీరకొనాలి - బావి చూచి చేద కొనాలి.

2657. పిల్లపోయినా పురిటికంపు పోలేదట.

2658. బెల్లమున్నచోట చీమలు చేరుతాయి

2659. భిక్షాధికారికి లక్షాధికారికి ఎందుకు పోలిక?

2660. మొగుడు చచ్చి మొత్తుకుంటూ వుంటే రంకు మొగుడొచ్చి రాళ్ళే సేడట.

2661. భలేభలే అంటాడు ముఖం తెలుసా అన్నాట్ట.

2662. మీయింట ఇంగలం మాయింట మంగలం అన్నాట.

2663. మంగలి పని గొరగడం చాకలిపని ఉతకడం.

2664. మంచం క్రింద మంతరసాని, మంచంపైన దొంగమూలాలు.

2665. మతిలేని పెళ్ళం గతిలేని మొగుడు.

2666. మనింటి దీపమేగదాని ముద్దుపెట్టు అన్నాట్ట.

2667. మంచి మనిషి లోతు - పాడుగొయ్యిలోతు తెలియవు.

2668. మట్టి దొరికిందని మాణిక్యం దొరుకుతుందా.

2669. మనిషి కడుపున రాక్షసి పుట్టచ్చు. రాక్షసి కడుపున మనిషి పుట్టడు.

2670. మాచికమ్మ సమర్తాడిందట నాలుగు తాటాకు ముక్కలి మ్మానాట్ట.

2671. మాచర్ల రాజులకు మీసాలు లేవంటే పల్నాటి రాజుల మిద్దె లకు వాసాలు లేవన్నాట

2672. మార్గశిరంలో మబ్బులు మాఘమాసంలో వానలు.

2673. మూల ముంచుతుంది విశాఖ విసురుతుంది.

2674. మూలవిరాటుకు పూజలేనప్పుడు - ఉత్సవవిగ్రహాలకు పోర తులెందుకు?

2675. మింగమెతుకు లేదు తాగ గంగ లేదు.

2676. మొగుణ్ణి గిల్లి మొయ్యో మొయ్యోమన్నదట.

2677. మోటువాడికి మొగలి పువ్విస్తే, తాంబూలమా అన్నాట్ట.

2678. మారుమనుం కోడలికి మలిమనుం అత్త సలహాలు

2679. ముడ్డికి తెలుస్తుందా కొప్పు అందం?

2680. మేుగుడంటే ముఖం మార్పు రంకు మొగుడంటే రంగు మార్పు

2681. రాజుగారి మేడలో గువ్వ చేరింది, రాణిగారి మేడమీద గోరింక చేరింది.

2682. రామాయణంలో పిడకలవేట రంగసాని దిబ్బమీద రంకులాట.

2683. రాతికుండ ఇనకతెడ్లు ఎక్కడన్న వుంటాయా?

2684. రౌతు మెతక అయితే గుర్రం మూడుకాళ్ళతో నడిచిందంట.

2685. రాక రాక అంటే పోకే పోకే అందట.

2686. రాజుగారి బావమరిదైన, బోగందాని తమ్ముడైన అన్నీ లాభాలే!

2687. రంభకోసం స్వర్గానికెళితే రాలుగాయే ఎదురయిందట!

2688. రాయిరాయి రాసుకుంటే నిప్పురవ్వలు. కొమ్మా కొమ్మా రాసుకుంటే నిప్పుమంటలు.

2689. రాగాలు తీసి తీసి గవయ్య అయినాడు.

2690. రోగాన పడీ పడీ నరకాన చేరాడు.

2691. రాచి రంపాన పెట్టే రకం

2692. రాగిడబ్బు సంపాదనలేదు వెండిరూపాయి అప్పా?

2693. రండి రండి రావే అంటేముండా వస్తావుందు అందట

2694. రాజునుజూసిన కంట మొగుణ్ణి మొత్త బుద్ధయిందట

2695. రామారామా అంటే ఏమిటా బూతులు అన్నాట్ట

2696. రామాయణమంతావిని రాముడిపెళ్ళాం సీతేనా అన్నాట్ట?

2697. రామ రామ అంటే రామకోటి, కామ కామ అంటే కామ కోటి!

2698. రావణ కాష్టం విభీషణ రాజ్యం

2699. రామన్నకు భీమన్నకు వరస కలిసినట్టు

2700. రాలుగాయి పెళ్లాం పేచీకోరు మొగుడు

2701. రాయి ఏదయినా మానే పళ్ళూడగొట్టుకోడానికి

2702. రాతి ముగ్గు కోతి ముగ్గు

2703. రాముడు కాలుతగిలి రాతినాతయితే నాకాలు రాయికి తగిలి కోతివుండయింది.

2704. రండ ముదిరితే రంగసాని, తొండముదిరితే వూసరవెల్లి

2705. రహస్యంగా బుట్టలో పెడితే వీధిపాలైందిట

2706. రంకుతనంవల్ల బొంకుతనం వల్ల బతుకుతీరదు.
2707. రాగులు చల్లితే రేగులు మొలిచాయట
2708. రథమెక్కింది దేవుడే అయినా కదిలించాల్సింది కనకాచారి.
2709. రెప్పవాల్చింది కొంపలార్పింది
2710. రాసిన తప్పులు దిద్దుకోవచ్చు చేసిన తప్పులు దిద్దుకోలేము
2711. రాతుకొత్తె తే గుళ్లుం కుంటిందట
2712. రెండుపూటలా తినడంభోగం ఒంటిపూట తింటం ఉపవాసం
2713. రానున్నది రాకమానదు పోనున్నది పోకమానదు
2714. రాక్షసికి నరమాంసం ముద్దు పందుకోతికి పుందుముద్దు.
2715. రాగిగొట్టం అయితే తాయిత్తు బంగారు గొట్టమైతే భుజకీర్తి
2716. రచ్చకెక్కినదాన్ని రాజయినా ఏం చేయలేదు
2717. రోజూతినేది తిండి. భక్ష్యంతో తినేది భోజనం
2718. రాగంతీస్తే గవయ్య చిడతలు కొడితే రాఘవయ్య
2719. రాచపీనుగ తోడులేనిదే పోదట
2720. రాజులదగ్గర ఉంటే రత్నాలు పేదల దగ్గరుంటే పలుకురాళ్ళు
2721. రామాయణ మంతావిని ఆంజనేయుడికి తోకుందా అన్నాట్ట
2722. రామకోటి రాశాట్ట తీటరోగం వచ్చిందిట
2723. రంకుతనం నేను చేస్తే నీకేం వచ్చిందే పోలేరమ్మ అన్నాట్ట.
2724. రేపటికి రెండు అనుకుంటే ఎల్లుండికి మూడు
2725. రామచిలుక మాట మాట అంటే బూతుబూతు అందిట
2726. రాజ్యంకూలిపోయినా బోగందాని బురుజు నిలిచిందిట.
2727. రాసుకునేదినాకు పూసుకునేది నీకు అన్నాట్ట
2728. రోలెక్కిన చిన్నది వోలి ఇచ్చిరమ్మన్నదట
2729. రాబందులకు వచ్చిన గొడ్లేప్రీతి
2730. రాటం మీదరాగం ఘోటంమీద దరువు.
2731. రాత్రి జాగారం పగటి పని చెరిచిందట
2732. రాగం తప్పిందిరా అంటే యతికి మతిలేదురా అన్నాట్ట

2733. రోకలితేరా పిచ్చోడా అంటే తలకి చుట్టుకోనా అన్నాట్ట

2734. రాతిబొమ్మకు బంగారపు సొమ్ములు బంగారు బొమ్మకు ఆకులు, పూలు

2735. రుచికి పుల్లకూర వాసనకు కరివేపాకు.

2736. రాజురాజు అంటే తిండికా, పనికా అని అడిగాట్ట

2737. రత్నాలు రాలాలి మంత్రాలు వెయ్యి అన్నాట్ట

2738. రాజుకంటే మొండివాడే బలవంతుడు

2739. రోగికి నిద్రరాదు భోగికి కునుకురాదు

2740. రాలిన పళ్ళు వేగినగుళ్ళు

2741. రోగాలు రాగాలు ఎన్నెన్నో ఉన్నాయి

2742. రాజా వారు ముష్టిదాన్ని మెచ్చారేమంటే నాకళ్ళతో చూడు మంత్రీ అన్నాట్ట.

2743. రెక్కలాడించిందే పక్షి

2744. రాముడులేని రామాయణమా?

2745. రంకునేర్చిన దానికి బొంకు నేర్పింది తోడు

2746. రాహువు కేతువు కలిసి శనికి సహాయం చేశారట

2747. రామాయణంలో భీముడెందుకు లేడు అన్నాట్ట

2748. రాతికుండని చూసి మట్టికుండ పారిపోయిందిట

2749. రూపాయిలేని వాడు కానిలేనివాడి దగ్గరికి అప్పుకెళ్ళాట్ట

2750. రామాయణం రాసింది బోయ భారతంరాసింది కోయ

2751. రామరాజ్యంలో బంగారం కరువు భరత రాజ్యంలో భోజనం కరువు

2752. రెడ్డొచ్చె మొదలాడు రాజొచ్చెమళ్ళాడు అన్నాట్ట

2753. రాజు మెచ్చిన భోగంది రాజ్యానికి సాని అయిందిట

2754. రంగసానే దొరసాని దొరసానే రంగసాని

2755. రత్నాలన్నీ కోటలో రాళ్ళన్నీ పేటలో

2756. రాజుగారి బావమరిది హోదా సానిదాని తమ్ముడుసోకు

2757. రాజుతలచుకుంటే రాళ్ళచేలో రత్నాలు పండుతాయి

2758. రొయ్యగాడికి బారెడు మీసం రోషగాడికి మూరెడు మీసం
2759. రోగం సంగతి రట్టయింది సంసారం గుట్టుగా ఉంచు అన్నాట్ట
2760. రోషానికి పోయిన పందెగాడు రోలుమెళ్ళో కట్టమన్నాట్ట
2761. రాయని భాస్కరుడు గీయని చిత్రకారుడు.
2762. రత్నానికి వాసనుంటుందా స్వర్ణానికి రుచుటుందా.
2763. రైతేరాజు బుధుడేమంత్రి
2764. రోగికోరిన పత్యమే వైద్యుడు చెప్పాడు
2765. రోలువెళ్ళి మద్దెలతో మొరపెట్టుకుందట
2766. రోషంలేని బంటుకు మీసంలేని రాజుకు నష్టమే లేదు.
2767. రెక్కాడితేగాని డొక్కాడని వాడికి రత్నం దొరికితే రాయి అన్నాట్ట.
2768. రాజెక్కింది గుఱ్ఱం చాకలెక్కింది గాడిద.
2769. రెండురెండే మెల్లంగారండే
2770. రోటికాడ రోకటిపాట ఇసుర్రాయికాడ అదేపాట.
2771. రక్షించిన వాడ్నే భక్షించు అన్నాట్ట
2772. రాగంరాని వాడికి పాటమోజు తాళంరాని వాడికి భజన మోజు
2773. రాత్రంతా భజనచేసినా భక్తి పూజ్యమేనట
2774. రాణీగారొచ్చారు రాగి సంకటి పెట్టమన్నారట.
2775. రెక్కలేని పక్షి తోకలేని నక్క
2776. రాజ్యంపోయింది రాజసం పోయింది ఇంకేముంది పోవటానికి
2777. రాణివాసం వచ్చింది మూలవాసం పీకమన్నాట్ట
2778. రాత్రికి వెన్నెల అందం చేనుకు కంకులు అందం
2779. రంగుల ఈక పక్షి పంజరానికి అందం.
2780. రాతరాసింది బ్రహ్మ గీతగీసింది లక్ష్మణుడు
2781. రోగానికి తగిన మందు పడితేనే రోగికి లాభం
2782. రోగం ఒకటి మందొకటి
2783. రోగానికి, రాగానికి, భోగానికి అంతంలేదు

2784. రాయిదెబ్బతిన్నా కర్రదెబ్బతిన్నా కడుపులోకి దొరికితే కైలాసం పోయినట్టే.

2785. రాజుగారి మోజు భోగందానికి భోగం.

2786. రహస్యం బట్టబయలు చేసి ప్రచారం మూసేశాడట.

2787. రంగులు మార్చేది ఊసరవెల్లి.

2788. రామచిలకపలుకు, కోకిలమ్మ కులుకు

2789. రొట్టెవిరిగి నేతిలోపడ్డా తినే అదృష్టముండాలి.

2790. రొయ్యమీసాలు దోమసంగీతం ఎవరికోసం

2791. రాగల వసంతాన్ని కాకులు ఆపగలవా?

2792. లాలీ లాలీ జో లాలి లాలీ డీ

2793. లోకాజనాసుఖినో భవంతు అంటాడు విద్వాంసుడు అనారోగ్యమే మహా భాగ్యం అంటాడు. వైద్యుడు

2794. లంకలో విభీషణుడు అడవిలో సూర్పణఖ

2795. లేనిదానికోసం పోతే ఉన్నది కాస్తాపోయింది

2796. లోకం ఎరగనివాడు అలంకారం ఎరగని ఆడది కొరగారు

2797. లంకణాల్లో తెచ్చుకున్న బలమంతా అపత్యంలో హరించుకుపోతుంది.

2798. లాభం లేని శెట్టి వరదన పోడనీ చెయ్యిచాచినా అందుకోలేదట.

2799. లాభానికి వ్యాపారం జుట్టుపట్టుకోడానికి జూదం

2800. లంకలో మేత తేవాలి ఏటికి అడ్డుకట్టమన్నాట్ట

2801. లంకలో పుడితే రాక్షసుడు కిష్కిందలో పుడితే కోతి.

2802. లంకణం చేయమంటే పచ్చమేంటి అన్నాట్ట.

2803. లగ్గం ముందా పల్లకి ముందా అన్నాట్ట.

2804. లేవలేని అత్తకి ఓపికలేని కోడలు సహాయం

2805. లేస్తే మనిషికాదు కదిల్తే కోతికాదు

2806. లాభం గూబలో కొచ్చింది ఆవునెయ్యితో తలంటమన్నాట్ట

2807. లేకలేక లోకాయి పుడితే చెవులు కుట్టడానికి గడ్డపార కావా లన్నాట్ట.
2808. లేడికి లేచిందే ప్రయాణం పందికి పడుకుందే నిద్ర.
2809. లోగుట్టు పెరుమాళ్ళకెరుక తెరగుట్టు సాతానికెరుక.
2810. లోభిసొమ్ము లోకులపాలు కానిసొమ్ము కాకులపాలు.
2811. లంకంత కొంపలో చెట్టంత చీపురు.
2812. లోకాయికి మాటనష్టం లోభికి మూటనష్టం.
2813. లవణం అంటే నాకు తెలియదా సోమిదేవమ్మ కూతుర్ని దూడరేణం అన్నట్ట.
2814. లోకం మెచ్చింది గొప్ప లోభిమెచ్చింది దిబ్బ.
2815. వెన్నెల అడవి కాచినా, వర్షం సముద్రంలో కురిసినా ఒకటే.
2816. వేములో తీపుండదు అత్తరికంలో ప్రేమ ఉండదు.
2817. విషం మాటలు తేనె పూతలు
2818. వుండి వుండి వసంతమాడాలనుకుంటే అవ్వ ఎదురొచ్చింది
2820. విశ్వేశ్వరుడైనా శని ప్రభావానికి లోకువే.
2821. వారణాసిలో గంగశుద్ధి జగన్నాథంలో కులంశుద్ధి.
2822. వాసనంటూ ఉంటే ఏ గుడ్డ కప్పినా ఆగదు.
2823. వెర్రిలేని గొల్ల తీపిలేని చెఱకు
2824. వేర్లు పడ్డ కాపురం గట్లు పడ్డ పొలం
2825. వీరణం లేనిది కొలువు కాదు పూరణం లేనిది బూరెకాదు
2826. వేలికి వేస్తే మెలికె కాలికి వేస్తే బంధం
2827. వారకాంత కట్టిన చీర వారణాసిపట్టు పేదరాలు కట్టిన చీర పిచ్చిపట్టు.
2828. వాసం పారు తప్పరాదు చుట్టరికం కులం తప్పరాదు
2829. వేడి నీళ్ళ పక్కన చన్నీళ్ళు ఉండాలి.
2830. వీధిలో చేసుకున్నాడు ఇంట్లో ఉంచుకున్నాడు.
2831. విజయభేరి మ్రోగించు అంటే రణభేరి మ్రోగిస్తానన్నాట్ట
2832. విశ్వామిత్రుడు సృష్టించిందే త్రిశంకు స్వర్గం.

2833. వుల్లిలేని కూర పప్పులేని పెళ్ళి.
2834. వైష్ణవుడు గురువు సాతాని శిష్యుడు.
2835. వీరణానికి తోరణం కడితే తాతయ్యకు పెళ్ళా అందిట.
2836. విద్యలేని బ్రాహ్మడు కత్తిలేని క్షత్రియుడు.
2837. వైకుంఠం పోవాలనుందా నాచేతిమాత్ర ఒకటిస్తానన్నాట్ట.
2838. వర్షంకురుస్తుంది అనుకుంటే వరద గూడేసిందట.
2839. వైరాగ్యంకోసం పురాణం వింటే పచ్చిశృంగారం వంటపట్టిం దట.
2840. విశాఖలో ఇల్లుకట్టద్దు పుబ్బలో విత్తు చల్లద్దు అన్నాట్ట.
2841. విరోధికి లోకం గిట్టదు యదార్థానికి అసత్యం గిట్టదు.
2842. వంటఇంట కుందేలు కుంపటిదగ్గిర కోడి.
2843. వండుకోడం చేతకానమ్మకు దండుకోడం చేతవ్వాలి.
2844. వరహా అసలుకన్నా మెహరు వడ్డీ ముద్దు.
2845. వసుదేవుల్లాంటి వాడే అవసరానికి గాడిదకాళ్ళు పట్టాడు.
2846. వనితక్కాని లతకుకాని, కవితకుకాని సహాయం అవసరం.
2847. వడ్డించేవాడు మన వాడేలే కడ బంతిన కూచో పరవాలేదు అన్నాట్ట
2848. వాతల అందం చూసి వాతరోగం పోయిందిట.
2849. వెన్నెల కాస్తే పున్నమి చుక్కలు కాస్తే అమాస.
2850. వెన్నువేస్తే పైరుకర్ర పొన్నువేస్తే చేతికర్ర
2851. వేలంవేస్తే అధికారి దండోరావేస్తే ఊరికాపరి.
2852. వెంకటేశ్వరుడికే తప్పలేదు వడ్డీలు కట్టడం.
2853. వేరుకు అందాలి నీరు కంకికి అందాలి పైరగాలి.
2854. వర్షాకాలంలో వరదలు ఎండాకాలంలో వడగాలులు.
2855. వొంటినిండా గంధం పంటినిండా వక్క
2856. వొడికితే దారం, ఒణికితే రోగం
2857. వంటిపూట రోగానికి పుట్టెడుమందులు.
2858. విష్ణువు పేరుతో గంగిరెద్దు శివుడు పేరుతో ఆంబోతెద్దు.

2859. వజ్రాయుధం వంటి మందు రామబాణం వంటి రోగం.
2860. విద్యలేని అయ్యగారికి వినయంలేని బంట్రోతు.
2861. వ్యాఘ్రానికి దయలేదు కామధేనువుకు స్వార్థంలేదు.
2862. వంకాయ కూరకు టెంకాయ మసాల.
2863. వీరమ్మభోగం రాగమ్మరాగం.
2864. వశిష్ఠుల వారు మంత్రాలు చదివితే పెళ్ళి అయిపోయినట్టేనా?
2865. వీధిలో వీరంగం సంతలో సారంగం.
2866. వయస్సు వస్తే సరసం వస్తుందా?
2867. వసంతం వచ్చింది కోకిల కూసింది.
2868. శంకినీ జాతికి పద్మినీ బుద్ధులా?
2869. శంకరగిరి మాణ్యాలకు దారి ఎటు అడిగాట్ట.
2870. శంకరా శంకరా అంటే మూతి వంకర పోద్దాన్నట్లు
2871. శతమానం నాకెందుకూ ఒక మానంతో చస్తుంటే అన్నాట్ట
2872. శంభులింగం కుప్పేకట్టు రామలింగం కనికట్టు
2873. శకునంచూసి పెళ్ళి కెళితే పేలాలేగాయట
2874. శ్రీవైష్ణవులమధ్య రొయ్యల బుట్టఖాళీ
2875. శేషాయ బుసలు కొడితే గరుడాయి గాండ్రించాడట
2876. ముద్దులు వందైనా ఒక్కముద్దు మిన్న
2877. శంఖం ఊదేది శంకుపాతేది
2878. శిష్యుడు పెరిగితే గురువు
2879. శనిపడితే ఏడేళ్ళు నేపడితే పద్నాలుగేళ్ళు
2880. శ్రీమహాలక్ష్మికి అవతారాలెక్కువ.
2881. శంభో శంకర అంటే మూతివంకరపోయింది అన్నాట్ట
2882. శెట్టిచేసిన ధర్మాలు సత్రంరాయిలో తెలుస్తాయిట
2883. శివ శివ అన్ననోటితో ఛీ ఛీ అన్నాట్ట
2884. శిరోభారం ఎందుకొచ్చిందంటే ఆలి చెయ్యి తగిలిందన్నాట్ట
2885. శత్రువుని చూసి కోషం సంతుని చూసి శాంతం.

2886. శుక్రవారంనాడు తన సొమ్ము మంగళవారంనాడు మంది సొమ్ము దాచుకోవాలట
2887. శంఖుగంట వాయిస్తే జంగం తాషామార్పా వాయిస్తే సా[illegible]
2888. శతమర్కటం అంటే విద్యార్థిని కాను అన్నాట్ట
2889. శివార్చకుడు వెళ్ళి తంబళిని కొట్టాట్ట
2890. శుంఠశుంఠ అంటే నా పేరెట్ల తెలుసు అన్నాట్ట.
2891. శగ తగిలితే పాకం కరుగుతుందట.
2892. శివుడంటే యముడికి కూడా భయమే
2893. శ్రావణ మేఘాలూ చిత్త జల్లులు.
2894. శివరాత్రికి చలి శ్రీరామనవమికి ఎండ.
2895. శోభనం నాడు సంతోషం, పురిటి నొప్పుల్లో ఏడుపు తప్పవు.
2896. శాస్త్రుల్లవారు సంధ్య వార్చక పోతే పొద్దుకుంకదా
2897. శివకాశిలో చేసింది ఆటంబాంబుకాదు రాజన్న చేసింది రాకెటుకాదు.
2898. శుక్రవారం శక్తిపూజ శనివారం శివపూజ.
2899. శనిగ్రహం చూపు, బుధగ్రహం దయ.
2900. శివరాత్రికి జంగాలు, సంక్రాంతికి హరిదాసులు.
2901. శివశివ అని సిగపెంచితే గోవిందా అని గొరిగేశాట్ట.
2902. 'శతమానం భవతి' అంటే ఒకటి చాల్లే అన్నదిట
2903. శతకోటి లింగాలున్నాయంటే నాదెక్కడుంది అన్నాట్ట.
2904. శంకినీ జాతి పాతివ్రత్యం
2905. సంకరజాతి అంటే సజ్జకర్రలాంటిదా అన్నట్టు.
2906. స్వర్గంలో శనికి భయపడి అరణ్యంలో దాక్కున్నాట్ట.
2907. సుఖమెరగని నిద్ర, ఆకలెరగని వంట
2908. సోమలింగం సోమలింగం అంటే రామలింగం కొడుకా అన్నాట్ట.
2909. సోమవారం వాగ్దానం మంగళవారం తొంటిచెయ్యి
2910. సూది బెజ్జం అంత గొంతు ఆకాశమంత ఆశ.
2911. సూర్యుడి ఆవేశం కవిగారి కావేశం.

2912. సన్నాయి నొక్కులేగాని సంగీతం లేదు.

2913. సూదికోసం సోదికి పోతే ఏడుతరాల రంకు బయట పడిందిట.

2914. సలక్షణాల పెళ్ళికొడుకు అనుకుంటే అవలక్షణాలన్నీ బయటపడ్డాయట.

2915. సంసారం వద్దని సన్యాసం పుచ్చుకుంటే గాడిద బరువుమీద పడింది.

2916. సొంఠిలేని కషాయం రాముడు లేని రామాయణం

2917. సాలెనేసిందే బట్ట కుమ్మరి చేసిందే కుండ

2918. సంగీతానికి గాడిదెనడగాలి అందానికి లొట్టెనడగాలి.

2919. సత్యభామ వేషంవేసి ఒక్కసారి వస్తానన్నాట్ట.

2920. సంతానంలేని సిరి పాండిత్యం లేని పేరు.

2921. సంతకం బలికోరుతుంది సరసం చలికోరుతుంది.

2922. సింగినాదంలో శృతిలేదు

2923. సేద్యం చెయ్యనివాడికి నైవేద్యానికి కూడా దొరకదు.

2924. సంతులేని తల్లి చింతలేని పెళ్ళి.

2925. స్థానబలమేకాని తనబలంలేదన్నాట్ట

2926. స్వర్ణం చూసిన కంసాలి ప్రేమ

2927. సరాల్లోదాగింది దారం పూదండలో దాగింది నార

2928. సిగ్గులేని వాడు శ్రీరంగం పోతే ఎగ్గులేని వాడు వెంకటగిరి పోయాట్ట

2929. సత్యం తప్పినా పత్యం తప్పినా పాట్లు తప్పవు

2930. సొమ్ముల ఆశ పాపం తెచ్చింది చెడు ఆలోచన చేటు తెచ్చింది.

2931. సింగారించుకున్నావేమె చిన్నదానా అంటే చలిగా ఉందిరా పులి మావ అందిట.

2932. సాక్ష్యం చెప్తావా శెట్టి అంటే సందులో అడిగొస్తా అన్నాట్ట.

2933. సాక్ష్యం చెప్పవే మానసా అంటే నోరు మూసుకొని నిద్రపో అందిట

2934. సంచిలేని వాడికి ముష్టిలేదు మల్లలేని వాడికి మాదాక్షవళం లేదు.

2935. సిగబారెడు దండమూరెడు

2936. సీతకు చెరలేక పోతే రావణాసురుడు లేడు

2937. స్వర్ణానికి వాసన రత్నానికి రుచి ఉండదు

2938. సంకటికోసం రాగులు గంజికోసం చోళ్ళు

2939. స్వర్ణం బండెడున్నా చిటికెడు టంకంలేనిదే అతుకుపడదు.

2940. సిద్దడి గురువు బ్రహ్మంగారు అబ్బడి గురువు అయ్యంగారు

2941. సొంఠిముదిరి అల్లాన్ని వెక్కిరించిందంట

2942. సంతోషం లేనిదే బలంలేదు ధైర్యంలేదు.

2943. సంధ్యా వందనం చెయ్యరా అంటే సూర్యుణ్ని ఆగమన్నాట్ట

2944. సంతలో సంసారం సానిదానికి పాతివ్రత్యం

2945. సంగీతానికి గార్ధభం హాస్యానికి కోతి

2946. సంసారం విడిస్తే సన్యాసం, స్వర్గం కాకుంటే కైలాసం.

2947. సన్నబియ్యంతో అన్నం ముతక బియ్యంతో పులిహోర.

2948. సన్నికల్లులేక పోతే పెళ్ళి ఆగదు సంధ్యవార్చకపోతె సంధ్య ఆగదు.

2949. సొతావిజియ్యరు మంత్రిత్వం జాంద్ర ప్రభువు రాజ్యాంగం

2950. సీతపుట్టకపోతే రామాయణంలేదు. కృష్ణుడు పుట్టకపోతే భారతంలేదు.

2951. సిరాబుడ్డి తేరా అంటే మొహం అంతా పూసుకున్నాట్ట

2952, సకలగుణాభిరాముడు అంటే కుంటిసీతమ్మ మొగుడా అన్నారట

2653. సూర్యుడా! నమస్కారం చేస్తాను అంటే ఆగుతాడా

2954. సంపదతెచ్చిన మెప్పులు దానితో పాటే పోతాయి
2955. సుబుద్ధికి చేటులేదు అబుద్ధికి అదుపులేదు.
2956. సందడిలేని పండగ తాళంలేని సంగీతం
2957. సాగినంతసేపు బొంకు సంబరంగానే ఉంటుంది
2958. సాయిబాబా సాయిబా? దేవుడు హిందువా?
2959. సోమవారం నాడు ఉపాసనా శుక్రవారంనాడు ఉపాదానం
2960. సురసుర మంటే నిప్పు, జరజర మంటేనీరు
2961. సిరిగలవాడే రాజు
2982. సోవియట్ వాళ్ళది శాంతిఖర్చు అమెరికా వాళ్ళది యుద్ధ ఖర్చు
2963. సభలో సోదరులు ఎన్నికల్లో మహాశయులు
2964. స్తంభంలేచినంత మాత్రాన భవనం అవుతుందా
2965. సూదిలోది దారం. దబ్బనంలోది తాడు
2966. సత్యంగారు అసత్యం పలకమంటే మాయింటి పేరబద్దమేగా
2967. సోమవారం శుభలక్ష్మి మంగళవారం మహాలక్ష్మి
2968. సోదిచెప్తే సోదమ్మ, మంత్రమేస్తే మంత్రగత్తె
2969. సాలినేత పట్టుపంచె, మాలనేత మడిపంచె.
2970. స్వామికార్యం స్వకార్యం సత్వరం జరగాలి.
2971. సత్యమే జయం అసత్యమే భయం.
2972. సుఖం స్వర్గం ఇహం దుఃఖం
2973. స్వర్ణం దగ్గరుంచుకొని బంగారం వెతికాట్ట.
2974. సంతానానికి కుచేలుడు సత్యానికి హరిశ్చంద్రుడు.
2975. సోమరిపోతుకు సోకుచేస్తే సంతను ఇంటికి రమ్మన్నాట్ట
2976. సూర్యుడికి స్వర్గం, లోభికి నరకం.
2977. స్వర్ణకలశంతో అవాహన మట్టికలశంతో ఉద్వాసన
2978. సుక్షేత్రంలో కాకి దొండ నల్లరేగడిలో నల్లేరు.

2979. సలహా చెప్పటం సులభం పాటించటం కష్టం.

2980. సరాలకు ముత్యాలు గీతాలకు సరాలు.

2981. సాకులు చెప్పేవాడువు పేపించే దెప్పేడు

2982. సంగీతం నేర్చినకోమటి వ్యాపారం చేసినట్లు

2983. సముద్రంలో వానకురిసినా అడవిలో వెన్నెలకాసినా ఎవరి కోసం 

2984. సూరీడుకు తిరకలేదు, సారధికి కాళ్ళులేవు.

2985. సోలిన అత్తసొగసు కొత్తకోడలి [illegible]సొగసు

2986. సారె తెచ్చిన కోడలు ముల్లెతెచ్చిన అల్లుడు

2987. సర్పంకాదు పాము అన్నాట్ట 

2988. హంసపాడులరాత ఆయాసంతో పాట

2989. హడావుడేంటే కుక్క అంటే ఊళ్ళో పెళ్ళే నక్క అందిట

2990. హిమగిరిలో ఉంటే నంది గంగారంలో ఉంటే గంగిరెద్దు

2991. హంసను చూసిన కాకి కులికి కులికి నడిచిందట

2992. హంసరాయబారం కోకిల మేజువాణి

2993. హనుమంతుడు లేని లంకాదహనమా.

2994. హస్తిచచ్చినా దంతాలు దొరికితే చాలు.

2995. హనుమంతుడి భక్తిబలం సీత కోసమా? రాముడుకోసమా!

2996. హనుమంతుడి భక్తిగొప్పా? రాముడి రూపం గొప్పా?

2997. హస్తిజాతి పెళ్ళాం, మూషిక జాతి మొగుడు.

2998. హస్తినిజాతిపుటక, శంకిణీ జాతి బుద్ధులు

2999. క్షీరసాగరంలో శేషావతారం, లవణసాగరంలో మత్స్యావతారం

3000. క్షవరం చేస్తే మంగలి తిరుక్షవరంచేస్తే వెంగలి.

3001. క్షేత్రయ్యలో వైరాగ్యం లేదు, సిద్దేంద్రుడులో శృంగారంలేదు.

3002. క్షేత్రయ్యపదం గోపాలుడికిష్టం త్యాగయ్యగీతం శ్రీరాముడి కిష్టం